9-10-1992 శుక్రవారం 10 పేజీలు సంపుటి : 63 సంచిక :41 విడిప్రతి : రు. 2.00 లు

Regd. No. H.N.L. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు

కలర్ ఆటో జెరాక్స్
శ్రీ రాఘవేంద్ర ఆటో జెరాక్స్
రాధా థియేటర్ ఎదురుగా
నెల్లూరు : ఫోన్: 23469
లామినేషన్ సౌకర్యము కలదు.

# విజయభాస్కరుడికే వరమాల!

పిజేపియన్ టోపిలోనుంచి కుందేలు బొమ్మ మాదిరి పివి మానసం నుంచి విజయభాస్కరరెడ్డి వెలికి వచ్చి, ఈ రోజు (9తేది)మధ్యాహ్నం 2.11 నిముషాలకు శుభలగ్నంలో నూతన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా పదవీ



ప్రమాణ స్వీకారం చేశారు. 7తేది రాత్రి 8గంటలకు హైదరాబాదులో జరిగిన సిఎల్‌పి సమావేశంలో కేంద్ర పరిశీలకులు సీల్డుకవరు తెరిచి, ఆయన పేరు చదివి, 16రోజుల రసవత్తర నాటకానికి తెర దించారు. సెప్టెంబరు 21తేది, ముఖ్యమంత్రిగా జనార్ధనరెడ్డి తన పదవికి రాజీనామా చేయాలని ఢిల్లీనుంచి హుకుం వచ్చింది;29తేది ఉదయం ఆయన రాజీనామా చేశారు. అప్పటి నుంచి ఇప్పటి వరకు రాష్ట్ర రాజకీయ రంగం ఎన్ని సుళ్లు తిరిగిందో, ఎన్ని మెలికలు పడిందో చెప్పలేము. ఈ పదహారు రోజులూ ఇటు హైదరాబాదులో, అటు ఢిల్లీలో జరిగిన పరిణామాలను పూసగుచ్చినట్లు వర్ణిస్తే-ఒళ్లు గగుర్పొడిచే నాటకం తయారౌతుంది.

విజయభాస్కరరెడ్డి పేరు ప్రకటించడానికి ప్రధాని తొమ్మిది రోజుల సమయం ఎందుకు తీసుకున్నారో అర్థమే కాదు. తలలు పండిన రాజకీయ వాదులు సైతం ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేకున్నారు. అందరి అభిప్రాయాలూ సేకరించి, ఏకాభిప్రాయం సాధించి, నాయకుడ్ని ఎంపిక చేయడం కోసమే ఇంత సమయం తీసుకున్నారన్నది కేవలం సాకుమాత్రమే. నిజంగా ఎందుకింత ఆలస్యం జరిగిందో చెప్పగలిగినవాడు పివి ఒక్కడే. ఆయన చెప్పడు. వినవస్తున్న పూహా గానాలను బట్టి ప్రధాని దృష్టిలో వున్నది వేరే అభ్యర్థి అన్పిస్తుంది. ఎమ్పీలనుంచి కాకుండా ఎమ్మెల్యేలనుంచి, అదీ ప్రాధాన్యత కోల్పోయిన అగ్రకులాలనుంచి ఒక క్యాండిడేట్‌ను ప్రతిపాదించాలని పివి భావించారట. కానీ అందుకు తగిన వాతావరణం ఏర్పడలేదు. సిఎల్‌పి తీర్మానంతోపాటు, నాయకత్రయం కూడా కొత్తనేత ఎంపిక స్వేచ్ఛ పివిదేనని ప్రకటించినప్పటికీ, అటువంటి అనామకుడ్ని రాష్ట్రానికి పంపితే తిరిగి పాత కథే పునరావృతమౌతుందని సందేహించినట్లున్నారు. తగిన వర్గబలం లేని నాయకుడ్ని ఎంపిక చేస్తే బలోపేతమైన వర్గాల నుంచి తిరుగుబాటు, ధిక్కార వైఖరి వస్తుందని కూడా భయపడినారంటారు. ఏదో ఒక ప్రయోగం చేసి తలనప్పి కొనితెచ్చుకోనేకంటే, ప్రస్తుతానికి పాత కాపులనే పంపి భారం దించుకోవడం నయమన్న ఆలోచనతో, అయిష్టంగానే విజయభాస్కరరెడ్డి పేరు సీల్డుకవరులో పెట్టారని చెప్తారు. ఎమ్మెల్యేలలో శ్రీపి రామచంద్రారెడ్డి, శ్రీకె.రోశయ్య, శ్రీ శ్రీపాదరావు పేర్లను పరిశీలించి, వదిలేశారట.

విజయభాస్కరరెడ్డికి జనార్ధనరెడ్డి 2తేది తేనీటి విందు ఇవ్వడం, పోలీసు ఉన్నతాధికారులు ఆయన్ని ముఖ్యమంత్రిగా భావించి హడావుడి చేయడం పట్ల పివి అభ్యంతరం తెల్పారట. నేను ఏ విషయం తేల్చక ముందే నువ్వు ఎన్నికైపోయినట్లు ప్రవర్తించడమేమిటని ప్రశ్నించాడట. దీన్ని బట్టికూడా విజయభాస్కరరెడ్డి ఎంపిక పివి మనస్పూర్తిగా చేసింది కాదని అర్థంచేసుకోవచ్చు అయితే తనను ప్రధాని నిలదీయడం పట్ల ఆయన చాలా బాధపడినట్లున్నాడు. తనకు రాష్ట్ర పదవి వద్దని ఎన్నిసార్లు చెప్పినా;పరిశీలకుల ద్వారా తనపేరు బయటకు తెచ్చి, ఇప్పుడీవిధంగా అభ్యంతర పెట్టడం ఏమిటన్నది విజయభాస్కరరెడ్డి వాదం. అందువల్ల ఆయన 6తేది సాయంత్రమే ప్రధాని తనను పిల్చి, నాయకత్వం స్వీకరించడానికి హైదరాబాదుకు వెళ్లమని చెప్పినా, పరిశీలకులు పేరు ప్రకటించే వరకు కదలకుండా ఢిల్లీలోనే కూర్చున్నాడు బెట్టుగా, గౌరవంగా, హుందాగా, 8తేది ఉదయం బేగంపేటలో విమానం దిగాడు.

ఈ ఎంపిక ద్వారా జనార్ధనరెడ్డి తాను అధికారంలో వున్నా లేకున్నా ఏనుగు వలె విలువైన వాడినేనని నిరూపించుకున్నాడు;ఆయన ప్రతిష్ట కూడా పెరిగింది. నిన్నటివరకు జనార్ధనరెడ్డి తాను స్వయంగా ముఖ్యమంత్రి మాత్రమే;ఇప్పుడు ముఖ్య మంత్రులను గద్దెనెక్కించగల కింగ్‌మేకర్-జనార్ధన రెడ్డి మద్దతు లేకుంటే విజయభాస్కరరెడ్డికి ఎమ్మెల్యేలూ

కొరవ 5 వ పేజీలో

## వైఎస్ వూరకుండే ప్రశ్న లేదు

## విధిలేకనే పివి ఈ నిర్ణయం తీసుకున్నాడా?

జమీన్‌రైతు

జమీన్‌రైతు కార్యాలయం
అక్టోబరు 15 తేది నుండి
దర్గామిట్టలోని నిప్పో ఎదురుగా సావిత్రినగర్
3 వ క్రాస్ రోడ్డు (పుట్టవీధి) లోని
మా నూతన భవనంలో పనిజేస్తుంది.
ఆ రోజు నుండి 'జమీన్‌రైతు' స్థిర నివాసం అదే.
పాఠకులు దూరాన్ని లెక్క చేయరని ఆశిస్తాము

కొత్త పోస్టల్ అడ్రసు
జమీన్‌రైతు
3 వ క్రాస్‌రోడ్ - సావిత్రి నగర్.
ఏ.కె.నగర్, నెల్లూరు - 524 004.
ఫోను: 27354

## తాను చేయలేని పని, చేయించాడు జనార్ధనరెడ్డి

# వైఎస్‌కు చావుదెబ్బ!

మంత్రివర్గ విస్తరణలో జనార్ధన రెడ్డి తన ప్రత్యర్థులందరినీ చావుదెబ్బ తీశాడు. తాను ముఖ్యమంత్రిగా చేయలేక పోయిన కార్యక్రమాన్ని, విజయభాస్కరరెడ్డి చేత దిగ్విజయంగా చేయించాడు. మంత్రి వర్గంలో వైఎస్‌రాజశేఖరరెడ్డి, చెన్నారెడ్డి వర్గాలకు చెందిన వారికెవరికీ-డి.శ్రీనివాస్, గీతారెడ్డి మినహా -స్థానం కల్పింప బడలేదు. 34గురు మంత్రులలో 30మంది జనార్ధనరెడ్డి సిఫార్సు చీటీ పొందిన వారే కావడం గమనార్హం. ఆఖరకు బలగం ప్రసాదరావు సైతం మంత్రిత్వం పొందలేదు. రవీంద్రారెడ్డివంటి హార్డ్‌కోర్ సంగతి చెప్పనవసరం లేదు. చెన్నారెడ్డి వర్గాన్ని ప్రక్కన పెట్టారు. మంత్రివర్గ నిర్మాణం చాలా సాహసోపేతంగా కన్పిస్తుంది ;ఫలితం ఎట్లాఉంటుందో చూడాలి. ఎందువల్లనో పి.రామచంద్రారెడ్డిని కూడా దూరం పెట్టారు.

* * *

# పసలకు మంత్రిత్వం

సూళ్లూరు పేట శాసన సభ్యుడు శ్రీపసల పెంచలయ్య మంత్రి అయ్యారు. ఈరోజు మధ్యాహ్నం కొత్తముఖ్యమంత్రితో



పాటు, ఆయనా క్యాబినెట్ మంత్రిగాపదవి ప్రమాణ స్వీకారం చేశారు. పెంచలయ్య చిరకాల వాంఛితం ఈడేరింది.

నెల్లూరు జిల్లానుంచి కొత్తమంత్రి వర్గంలో పెంచలయ్య ఒక్కడికే ప్రాతినిధ్యం లభించింది. జనార్ధనరెడ్డి సూచన మేరకు శ్రీవిజయ భాస్కరరెడ్డి ఈ అవకాశం కల్పించారు. జిల్లానుంచి పెంచలయ్యను ఎంపిక చేయడంలో జనార్ధనరెడ్డి రాజనీతిజ్ఞత వ్యక్తమౌతుంది. ఇతరులెవరరికి సిఫార్సు చేసి వుండినా జిల్లా ఎమ్మెల్యేలలో కోపతాపాలు ప్రజ్వరిల్లి వుండేవి. ఇంకొక ప్రక్క పెంచలయ్య ద్వారా గూడూరు డివిజన్‌లో నల్లపరెడ్ల విధ్వంసక రాజకీయాలను ప్రతిఘటిం చేందుకు వీలౌతుంది. శ్రీనివాసులురెడ్డి నోట్లో నోరు పెట్టగల వాడు పెంచలయ్య ఒక్కడే!

మంత్రిత్వానికి పెంచలయ్య అన్నివిధాలా అర్హుడు. విద్యావంతుడు. అధికారిగా పనిచేసిన వాడు కాబట్టి ప్రభుత్వ పైస్థాయి పరిశీలనానుభవం వుంది. పార్లమెంటు సభ్యుడిగా రాజకీయ పరిజ్ఞానం సముపార్జించుకున్నారు. ఎన్నో ప్రతికూల పరిస్థితుల మధ్య సూళ్లూరు పేటలో

కొరవ 5 వ పేజీలో

పెడదారి పడుతున్న సారాయి ఉద్యమం

# అంగళ్లు మూసినంతనే త్రాగుడు మాయమౌతుందా?

నెల్లూరు జిల్లా సారాయి ఉద్యమ బీజం కళ్లముందే మహావృక్షమై ఎదిగి పోయింది. ఇంతింతై, వటుదింతై, నభోమండలమంతెత్తుకు ఎదిగినట్లు ప్రపంచవ్యాప్త ప్రాచుర్యం పొందుతోంది. రెండు వారాల క్రితం బిబిసి టివిలో ఈ వార్త ప్రసారం చేశారు; నెల్లూరు మహిళల ఊరేగింపును ప్రపంచ టివి ప్రేక్షకులందరికీ రంగుల్లో చూపించారు. రాష్ట్రంలో ఈరోజు సారాయి ఉద్యమం ప్రారంభం కాని జిల్లా లేదు. తెలంగాణాలో సైతం మహిళలు సారాయంగళ్ల విధ్వంసానికి పాల్పడుతున్నారు. సారాయి త్రాగేవారికి శిరోముండనాలు, అమ్మేవారికి పాత చెప్పుల దండలతో సత్కారాలు చేస్తున్నారు. ఎక్కడికక్కడ, ఎవరికి వారుగా తమ స్వంత నిర్ణయాలతో ఉద్యమాన్ని నడిపించేస్తున్నారు. సారాయి ఉద్యమ చరిత్రను ఎవరైనా లిఖిస్తే అందులో నెల్లూరు పేరు ప్రముఖంగా ప్రస్తావించక తప్పదు. భారత దేశంలో జరిగిన వివిధ సామాజిక ఉద్యమాల సరసన ఈ ఆందోళన సైతం చిరస్థాయిగా నిల్చిపోతుంది.

ఇంతటి చరిత్ర సృష్టించిన, సృష్టిస్తున్న ఈ ఉద్యమం, సాధించిన ఫలితాలేమిటి? జిల్లాలో సారాయి వేలం పాటలు జరగకుండా, కాంట్రాక్టర్లెవరినీ ఆ దరిదాపులకు రానివ్వకుండా నిరోధించ గలిగారు మహిళలు. ఏ గ్రామంలోనూ ఇప్పుడు బహిరంగంగా సారాయంగడి నడవడం లేదు. అయితే సారాయి పాటలు నిల్చిపోయినంత మాత్రాన ఉద్యమం ఫలించినట్లు లెక్క అనిపెట్టేసుకుంటే మాత్రం, సారాయి వ్యతిరేకాందోళన సాధించేది దానికంటే, సాధించవలసింది అనంతంగా వుందన్న నిజం వెల్లడవుతుంది.

దాదాపు ఆరు నెలలనుంచి జిల్లాలో సారాయి ఉద్యమం జరుగుతుంది. అంగళ్ల ధ్వంసం, పొట్లాల దగ్ధం వార్తలు వస్తున్నాయి. ఆరు వందల గ్రామాలలో అంగళ్లు మూతపడ్డాయని ఉద్యమ నిర్వాహకులు సగర్వంగా ప్రకటించుకున్నారు; అక్టోబరు 1తేది తర్వాత జిల్లాలోని ఏ మారుమూల ప్రదేశంలోనూ సారాయి అమ్మకాలు లేవని సంతోషంగా చెప్తున్నారు. సారాయి ఉద్యమ లక్ష్యం అంగళ్లమూత కాదు-అవ్యసనం మాన్పడం. నిత్యం మత్తులో జోగే వారిని ఆ జోలికి పోకుండా నిలపడం. అయితే అమ్మకాల లెక్కలు చూస్తే ఈ విషయంలో ఉద్యమం ఎంత వెనుక బడివుందో తెలుస్తుంది. అక్టోబరు 1తేదితో ముగిసిన సారాయి సంవత్సరంలో జిల్లాలో 43లక్షల 40వేల లీటర్ల సారాయి అమ్ముడు బోయిందట. అంతకు క్రితం కంటే ఇది రెండు లక్షల 40వేల లీటర్లు ఎక్కువ. ఆరు నెలల పాటు ఆరు వందల గ్రామాలలో అంగళ్లు మూతపడితే, అమ్మకాలు సగానికి సగం పడిపోవలసింది కాస్త, ఎందుకు పెరిగినట్లు? ఏమిటీ మతలబు? మద్రాసుకు స్మగ్లింగ్ వల్ల ప్రభుత్వం నుంచి తీసుకొనే స్టాక్ పరిమాణంలో తేడా రాలేదనేది ఒక వాదం. కాని, మద్రాసు స్మగ్లింగ్ ఎప్పుడూ వుంది. ఈ ఏడాది అదనంగా జరిగిందనుకున్నా జిల్లాలో బహిరంగంగా తయారైన కాపుదు సారా సంగతేమిటి? అంగళ్లన్నీ మూతబడితే ఈ సారాయంతా ఎవరు త్రాగుతున్నట్లు? ఇప్పుడు సైతం, ఎక్సైజ్ అధికార్లు 14చోట్ల అంగళ్లు తెరిస్తే, ఒక్క 5తేది 9వేల లీటర్లు అమ్ముడుబోయిందట. గత సంవత్సరం సగటు (11వేల 890లీటర్లు) అమ్మకాలకు ఇంచు మించు దగ్గరగా వుందిది. మరొక వారంలో ఇంకొక 50కొత్త కేంద్రాలు పెట్టి సారాయి అమ్ముతారట. అధికారుల అంచనాల

> * ఎర్రజెండా రెపరెపల్లో ఉద్యమ లక్ష్యాలు మటు మాయం.
> * కాపుడు సారా, గంజాయి వంటి విషాలకు అలవాటయ్యే ప్రమాదం!

కొరవ 6 వ పేజి లో

# కోవూరు చక్కెర ఫ్యాక్టరీకి జాతీయ స్థాయి అవార్డు

కోవూరు చక్కెర ఫ్యాక్టరీ జాతీయ స్థాయి అవార్డు సాధించింది. దేనికనుకున్నారు- చెరకు అభివృద్ధిలో రికార్డు సాధించినందుకు! ఛైర్మన్ శ్రీ సామంతు సుబ్బారెడ్డి గారు ఢిల్లీ వెళ్లి, సెప్టెంబరు 30 తేది, కేంద్ర వ్యవసాయ మంత్రి శ్రీ బలరాం జాకర్ చేతుల మీదుగా ఆ సత్కారం అందుకొని తిరిగి వచ్చారు. గత మూడేళ్లలో ఫ్యాక్టరీ పరిధిలో చెరకు విస్తీర్ణం పెంపు, క్రషింగ్ సామర్థ్యం, క్రషింగ్ చేసిన రోజులను పరిగణనకు తీసుకొని, కోవూరు ఫ్యాక్టరీని దేశంలో సెకెండ్ బెస్ట్‌గా నిర్ణయించారట. మన రాష్ట్రం వరకు ఇటువంటి అవార్డు రావడం ఇదే ప్రథమం.

1989-90 సీజన్‌లో, 142 రోజులు ఫ్యాక్టరీ నడిపి, లక్షా 64 వేలా 369 టన్నుల చెరకు ఆడితే; 1991-92 లో 172 రోజులు క్రషింగ్ చేసి రెండు లక్షలా 28 వేలా 866 టన్నుల వరకు ఆడించారు. అప్పుడు ఫ్యాక్టరీ పరిధిలో 54 11ఎకరాలు సాగులో వుంటే ఇప్పుడు 6893 ఎకరాల చెరకు తోటలున్నాయి. అప్పటి రికవరి 8.32 శాతం; ఇప్పటి రికవరి 9.05 శాతం ఎక్కువ దిగుబడిఇచ్చేరకాలను ప్రవేశపెట్టి, రైతులకు సలహాలివ్వడం ద్వారా ఉత్పత్తి పెంచి ఈ అవార్డుకు అర్హత పొందామంటున్నారు సుబ్బారెడ్డిగారు; ఫ్యాక్టరీ ప్రతిష్టను దేశ స్థాయికి పెంచడంలో ఎం. డి శ్రీ సూర్యనారాయణ రావు, వ్యవసాయాధికారి శ్రీ బాబునాయుడుల కృషికి ఆయన కృతజ్ఞతలు చెప్పారు.

## జిల్లా వార్తలు

### అల్లూరులో దసరా కళ

అల్లూరులో గత దశాబ్దంగా సబ్బుగా వున్న దసరా వేడుకలు మళ్లీ ఈ సంవత్సరం పునరుద్ధరించడంతో అర్ధరాత్రుల్ల వరకు కొనసాగాయి. సోమవారం పుహాలక్ష్మమ్మ దేవస్థానం నుండి దేవి గ్రామోత్సవం భారీ ఎత్తున బయలుదేరింది. దసరా పండుగ వైభవం కళకళలాటట్లుగా కనపడే విధంగా 30 మంది పైగా పలు వేషాలు వేసుకొని పట్టణ ప్రజలను అలరించారు. దేవస్థానాలన్నీ విద్యుత్ దీపాలంకరణలతో కంటి కింపుగా కనిపించాయి.

కొరవ 6 వ పేజి లో

# పినాకి శరం

## స్వాగతించదగిన నియామకం

ముఖ్యమంత్రిగా శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి నియామకం స్వాగతించదగినది. కొండంత రాగం తీసి, అభిప్రాయ సేకరణ పేరుతో పరిశీలకుల అంతం లేని పరిశీలనలతో పెద్ద ప్రహసనం నడిపి, కాంగ్రెస్ శాసనసభ్యులందరూ తమ తలలు తీసి పి.వి. చేతిలో పెట్టిన అనంతరం కూడా తెగని ఆలోచనలు జరిగి, కడకు విజయభాస్కర రెడ్డిగారు నియమింప బడినా, అది ప్రజామోదమైన నిర్ణయమే. ఆయన నామినేటెడ్ నాయకుడే గాని, ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికైన ముఖ్య మంత్రి కాదు. కాంగ్రెస్‌లో అంతర్గత ప్రజాస్వామ్యం గుడ్డు కారిపోయి చాలాకాలమైంది; దాన్ని గూర్చి కొత్తగా చింతించ వలసిన అవసరం లేదు!

ప్రస్తుతం కాంగ్రెస్ పార్టీలో విజయభాస్కర రెడ్డి వంటి అనుభవజ్ఞుడైన వ్యక్తి లేడు. జిల్లా పరిషత్తు చైర్మన్ నుండి కేంద్రమంత్రిత్వానికి ఎదిగి, రెండవ సారి ముఖ్యమంత్రి కాగలిగిన నాయకుడాయన. మంత్రిగా ప్రధాని పి.వి. కంటే సీనియరు. రాజకీయ సూక్ష్మాలను ఎరిగిన వాడు; పరిపాలనా లోతుపాతులను చూచినవాడు; ఇన్నేళ్లుగా ఇన్ని పదవులలంకరించినా చెడ్డపేరు లేకుండా గౌరవంగా వుండగల్గుతున్నవ్యక్తి. తన సొంత జిల్లాలో తప్ప వివాదరహితుడు. బ్రతిమలాడించుకొని 73 ఏళ్లప్రాయంలో బెట్టుగా రెండవ సారి ముఖ్యమంత్రి అవుతున్న అపార అసాధారణ అదృష్టశాలి శ్రీ విజయభాస్కర రెడ్డి.

అయితే ఆయన ముఖ్య మంత్రిత్వం నెరపిన రోజులకి, ఇప్పటికి చాలా తేడా వుంది. ఈ ప్రజలు వేరు, ఈ శాసన సభ్యులు వేరు, ఈ సమస్యలు వేరు, ఈ వాతావరణమే వేరు. ఇటువంటి క్లిష్టసమయంలో వయస్సు అనుకూలత మధ్య ఆయన చేబడుతున్న రాష్ట్ర ప్రభుత్వాధిపత్యం, ఆయన సమర్థతకు పాలనాదక్షత కొకపరీక్ష, సవాలు. పదవిచేదై కాదుకాని, ఈ భయంకర వాతావరణం మనసులో మెదలి పదవిస్వీకరణకు తటపటాయించి వుంటాడు; ఏ శ్రమా లేకుండా హాయిగా ఢిల్లీలో వుండిపోతే సరి పోతుందనుకొని వుంటాడు. విజయ భాస్కర రెడ్డి గారి కున్న ముఖ్యమైన అనుకూలత ఏవర్గాన్నుండీ, తనకు సంబంధించి వ్యతిరేకాభిప్రాయం లేకుండా ముఖ్యమంత్రి కావడం!

విజయభాస్కర రెడ్డి గారికి వర్గతత్వం లేదా? ఆయన వర్గాల కతీతుడా? అవునని చెప్పడానికి సాహసించగలమా? ఈ సారి ఆయనకు జనార్ధనరెడ్డి అభ్యర్థి అనే పేరు వచ్చింది; డాక్టర్ రాజశేఖర రెడ్డికి సమ్మతుడైనాడు. పరమ శత్రువులైన జనార్ధనరెడ్డి - రాజశేఖర రెడ్డి ఇద్దరి అభ్యర్థి కావడం అసంభవం. ఎవరో ఒకరు గట్టిగా కోరి వుండాలి; ఇంకొకరు ఎవరో వచ్చేకంటే ఈయనే మేలు అని విధిలేని పరిస్థితుల్లో సర్దుకొని పోయివుండాలి. విజయభాస్కర రెడ్డి ఎవరి అభ్యర్థి అయినా రెండవ వారికి వ్యతిరేకం కాదు. రాజకీయాలలో ఈనాటి స్నేహాలు రేపు విరోధాలవుతున్నాయి; ఈనాటి విరోధాలు రేపటి స్నేహితాలవుతున్నాయి. ఆప్తులు శత్రువులవుతున్నారు; శత్రువులు ఆప్తులవుతున్నారు. జనార్ధనరెడ్డికి విజయభాస్కర రెడ్డి ముఖ్యమంత్రి పదవిలో ప్రత్యర్థి; అందివచ్చిన ఆయన అవకాశాన్ని వమ్ముజేసి ఆయన్ను వెనక్కు నెట్టిన వ్యక్తి. ఈనాడు ప్రస్తుతానికి ఇద్దరూ ఒక టోకట్లోకటి! అదేవిధంగా రాజశేఖర రెడ్డికి కూడా! రాజకీయ నాయకుల సంబంధాలు శాశ్వతాలు కాదు -క్షణికాలు. వాటిని బట్టి ఎవరు ఎవరి మనిషి, ఎవరు ఏ వర్గము అని దృఢంగా చెప్పడం అవివేకమే అవుతుంది. రెండవ సారి ముఖ్యమంత్రి కాగలిగిన శ్రీ విజయభాస్కర రెడ్డి గారికి హార్దికాభినందనలు.

మరిచి పోదామన్నా మనసు పూరు కోవడం లేదు; పదవి నుండి వైదొలగవలసిన పరిస్థితులను కల్పించుకున్న జనార్ధనరెడ్డి దురదృష్టాన్ని తలచుకుంటే గుండె నీరై పోతున్నది! కందుకు లేని దురద కత్తి పీటకెందుకంటారా!

## జిల్లా రాజకీయాలు

### హుషారెక్క బోతాయి!

జనార్ధనరెడ్డి ముఖ్యమంత్రి అయినప్పటి నుండి జిల్లాలో కాంగ్రెస్ రాజకీయాలు చప్పబడిపోయాయి. హృదయ కుహరాలలోఎక్కడో ఏ మూలో దాగి వుంటే వుండవచ్చుగాని, బహిరంగంగా మాత్రం శాసనసభ్యులలో గాని, ఇతరులలో గాని నాటకాలు, వేషాలు వుభయభాష ప్రావీణ్యతలు ద్యోతకం కాలేదు. ముఖ్యమంత్రి కాబట్టి వ్యతిరేకంగా కనపడడం శ్రేయస్కరం కాదనుకున్నారో; జనార్ధనరెడ్డి అందరినీ ఆ విధంగా పట్టు బాలు వేసుకుంటూ వచ్చారో తెలియదు కాని, ఒక్క నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి తప్ప తక్కిన తొమ్మిది మంది శాసన సభ్యులూ జనార్ధన రెడ్డి వర్గీయులే అనిపించారు. ఏ పదవి లభించని యానాది రెడ్డి, విష్ణువర్ధన రెడ్డి, వెంకటరత్నం నాయుడు గారలు కూడా అవిధేయంగా వ్యవహరించ లేదు. ఇక చూడాలి ఎవరి నిజ రంగు ఏమిటో!

కొరవ 6 వ పేజి లో

స్త్రీల టానిక్
లోధ్ర
కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-600 014.
CROWN-TV
కలర్ మరియు B/W TVల పై
DIGITAL 21
స్టీరియో సౌండ్స్
PH: 25428
ట్రంక్ రోడ్-నెల్లూరు.

# జమీన్‌రైతు

## కొత్త ప్రభుత్వం

ఎట్టకేలకు, చిట్టచివరకు ఆంధ్రప్రదేశ్ లెజిస్లేచర్ పార్టీ నాయకుడి పేరు ప్రకటించ గలిగింది కాంగ్రెస్ అధిష్టాన వర్గం. చేతిలో మేకపిల్ల పెట్టుకొని దేశమంతా వెతికినట్లుంది ఈ ప్రహసనం. ప్రధాని శ్రీ పి.వి. కళ్లముందే తిరుగుతుండినాడు విజయభాస్కర రెడ్డి. ఆది నుండి ఆయన పేరు పరిశీలనలో వున్న సంగతి లోకానికంతా తెలుసు. జనార్దనరెడ్డి రాజీనామా సమర్పించిన రోజే ఆ పేరు కాస్త బయట పెట్టివుంటే పార్టీ పరువు నిల్చివుండేది; ప్రభుత్వం లేని పరిస్థితి తొలగి వుండేది. కాని పి.వి. ఎందువల్లనో ఈ నిర్ణయం ప్రకటించడానికి పదిరోజులు సమయం తీసుకొని, సమస్యను నానవేసి, సాగదీసి, పలు అవాంఛనీయ పరిణామాలకు ఆస్కారం కల్పించి, పార్టీ ప్రతిష్టను గంగపాలు చేసి, జనంలో కాంగ్రెస్‌ను నవ్వులపాల్జేసి , ఆ తర్వాత చల్లగా తన మనసులోని అభిప్రాయం బయటపెట్టారు. ప్రధాని పదవిలో వున్న వ్యక్తులు, అతి ప్రధాన సమస్యలపైనే ఇటువంటి నాన్చుడు వైఖరి అవలంబిస్తే, నిత్యపాలనా వ్యవహారాలను ఎట్లా నిర్వహించగలరన్న సందేహం కలుగుతుంది.

ఈ రోజు (9 తేది) సాయంత్రానికి కొత్త ప్రభుత్వం ఏర్పాటు జరిగి పోతుంది. ప్రజలు కాంగ్రెస్‌కు అధికారం ఇచ్చిన తర్వాత ఏర్పడుతున్న మూడవ ప్రభుత్వమిది. అసెంబ్లీ ఎన్నికలు జరిగి మూడేళ్లు కాక ముందే మూడవ ముఖ్యమంత్రి ప్రమాణ స్వీకారం చేయవలసి రావడం దురదృష్టకర పరిణామం. ప్రజల శ్రేయస్సుకు సంబంధించిన ఏ విధాన నిర్ణయమైనా ప్రతిపాదించి, ఆచరణకు తేవడానికి కొంత వ్యవధి కావాలి. అందుకే రాజ్యాంగ రూపకర్తలు ఎన్నికైన ప్రభుత్వ ఆయుర్దాయం ఐదేళ్లుగా నిర్ణయించారు. ఈ నిర్ణీత వ్యవధిలో ఒకే నేత ఆధ్వర్యంలో ప్రభుత్వం మనుగడ సాగించ గల్గితే, పరిపాలనాపరంగా తన సమర్థతను లేదా దక్షతను ప్రజలకు నిరూపించ గలుగుతుంది. దురదృష్టవశాత్తు ఆంధ్రప్రదేశ్ వరకు అది జరగడం లేదు; ముఖ్యంగా కాంగ్రెస్ పార్టీకి అసలు చేత కావడం లేదు. 1978 - 82 ల మధ్య కాలంలో ఒకసారి చూశాం; ఇప్పుడీ మూడేళ్లలో మూడుసార్లు చూస్తున్నాం; మిగిలిన రెండేళ్లయినా కొత్త ప్రభుత్వం సజావుగా సాగుతుందో లేక 4 వ కృష్ణుణ్ణి తెరపై చూసే దౌర్భాగ్యం ఆంధ్రులకు కల్గుతుందో చెప్పలేము. ముఖ్యమంత్రి ప్రమాణ స్వీకారోత్సవం నాడే, అతడి పతనానికి ప్రతిన బూనే అసమ్మతి వర్గం తలెత్తే పరిస్థితులలో ఎవరి ఆయుష్షుకు ఎవరు హామి ఇవ్వగలరు?

విజయభాస్కర రెడ్డి రాష్ట్రంలో కెల్లా సీనియర్ రాజకీయ వాది. సుదీర్ఘ రాజకీయానుభవం కల్గిన నాయకుడు. ఎన్నో పదవులు అనుభవించిన వాడు. ఎంత అనుభవం వున్నా, నూతన ముఖ్యమంత్రిగా ఆయనకు తన పరిపాలనా సమర్థతను వ్యక్తీకరించడానికి సావకాశం లభిస్తుందా అన్నదే సందేహం. ఇక మిగిలి వున్నదే రెండు సంవత్సరాలు. ఈ స్వల్ప వ్యవధిలో ఏ నూతన ప్రయోగాలు చేసి, ఫలితాలు సాధించి ప్రజలకు చూపగలరు? ఎవరైతే మాత్రం చేయగలిగిందేముంది. అందులోనూ ఆయనకు తొలి రోజు నుంచే రాష్ట్రాన్ని సంక్షోభంలో ముంచెత్తుతున్న పలు సమస్యలు స్వాగతం పల్కు తున్నాయి. నక్సలైట్ల బెడద, సారాయి ఉద్యమం, కరువు పరిస్థితులు, విద్యుత్ కొరత, ఖజానాలోటు, ప్రతిపక్షాల ముమ్మరదాడి వంటి సమస్యలను ఎదుర్కొనే టప్పటికే ఆయన తలప్రాణం తోకకు వస్తుంది. మరో ఏడాది గడవగానే రాష్ట్రంలో ఎన్నికల వాతావరణం ఏర్పడి పోతుంది. అసమ్మతి సరేసరి. దేశరాజకీయాలు నిలకడగా వుంటే పర్వాలేదు ! అక్కడా దురదృష్టం కొద్దీ అస్థిరత ఏర్పడితే, రాష్ట్రంలో రాజకీయ సుస్థిరత గగనకుసుమమే అవుతుంది. ఈ విపత్కర పరిస్థితులలో ప్రభుత్వ నేతృత్వాన్ని స్వీకరిస్తున్న విజయ భాస్కర రెడ్డికి

ముఖ్యమంత్రి పదవి ముళ్లకిరీటమే తప్ప, పూలపాన్పు కాదు. ఒక సారి తన చేతుల మీదుగా కాంగ్రెస్‌కు దహనసంస్కారాలు చేసి, తెలుగుదేశానికి అధికారం అప్పగించాడన్న అపఖ్యాతి ఆయనకుంది. తిరిగి ఆ చెడ్డపేరు తెచ్చుకోకుండా వుండాలంటే ఈ రెండేళ్ల కాలంలోనూ చిత్త శుద్ధితో శ్రమించి, ఆదర్శవంతమైన పరిపాలనను అందివ్వక తప్పదు. ఒక్క క్షణం వృధా చేసినా, తప్పుడు నిర్ణయాలు, విధానాలలో పొరపాట్లు చేసినా, అది సరిదిద్దుకోలేని తప్పిదమౌతుంది. తనకున్న అపార అనుభవం ద్వారా, రాజకీయ పరిణతి ద్వారా ఆంధ్రప్రదేశ్‌కు మంచి పరిపాలన అందివ్వగలరని, ప్రజలలో కాంగ్రెస్ పట్ల ఏర్పడిన దురభిప్రాయాలు తొలగించగలరని ఆశిద్దాం!

## జమీన్‌రైతు

ఉగాది పంచాంగం వార్తల్లో రామానాయుడి గారి కలం కల్గించిన గుర్రం పరుగెత్తేది. ఆయన ఇచ్చే ఉగాది బిరుదుల కోసం ఆనాటి నాయకులు ఎదురుచూసేవారు. ఉగాది ఫలాలపై 15.3.45 సంచికలో ఆయనెంత చమత్కారంగా వ్రాసారో చదవండి!

### చిత్రగుప్తుని పంచాంగం

పంచాంగ శ్రవణ ఫలం

శ్లో॥ స్త్రీ కల్యాణము చేయడం,
వరుని కంటా అస్థిజర్పించడం,
అప్పుల్ నీటను ముణ్గడం
తేలడం, ఆశాస్త్ర కొంపార్పడం,
ఇంపాలీమెన్నికి లాగడం, పరువు
మర్యాదల్‌గూడ పొగొట్టడం,
నానా భ్రష్టత ప్రాప్తరం,
అడవిద్దల్‌గన్న తల్లంత్రికీ,
ఏతత్కాల వినోదం, సమహితం,
పంచాంగ మాకర్ణతామ్.

ఈ సంవత్సరం:-

**రాజా గురువు-**

విశ్వవిద్యాలయ పోటీశ్చ
ధృతరాష్ట్రోపనతు గెల్వడం
కాంగ్రెసువర్గంతు చిందంతి
గెల్వడం రెడ్డి నిశ్చయం.

**మంత్రి శుక్రుడు-**

అట్లాంటిక్ చార్టర్ విషయే
యిండియా మినహాయిన
అబద్దే సత్యతుల్యానాం
చర్చిల్ ఖల్లగుద్దితః

**సస్యాధిపతి చంద్రుడు**

రైత్వారీ సస్యసమృద్ధిః
జమీన్‌దారీ మేషు నాశనం
అధికాహార ప్రచారేణ
కాకితం మీరసి లభేత్.

### పాత సంపుటాల్లో...

**సస్యాధిపతి శని-**

మనగోధు మస్యప్రజా భుజంతే
అన్యేన గోధుమ మన నెత్తిన రుద్దితః
'సబ్సిడీ' అన్య దేశీయులాభతః
మన రైతులోనష్టకృతేవ సర్వదా॥

**అర్ఘాధిపతి గురువు**

కొండిశ్చఅర్ఘాధిప ఆంధ్రలోకే
పంజాబుకంటె తక్కువరేటు తండులా॥
పతిశ్చ ప్రజ అతుల లాభసిద్ధిః
రైతాంగణాం మాత్రము బ్రతిమిలొట్టి॥

**మేఘాధిపతి గురువు**

అధికవర్షం అతివ్యాప్తి
జమీందారీమ కిం ప్రయోజనం ?
తటాకే మస్థితింకృత్యా
గురువే మేఘాధిపే సతి.

**నీరసాధిపతి చంద్రుడు**

అభిలేస దివాందరంచ
లాభ మిస్‌కంటూర్స్ మింగుతీ
తలోదాశిస గర్తా
ఏమరేమిచేయగలరోయి చంద్రః.

**పశుపాలకుడు గోపాలుడు**

పశుగ్రాసే వెంకటగిరి రాజ్యభాగే
దివ ది నప్రవర్ధమానే రైతు కోటే
ఎప్పార్లని దేముడు చూచు మారకుండు॥
కబ్బెలపంకహాయ్యేనతిర్యుతముందుకాలః

**సంక్రాంతి పురుషల లక్షణం**

ఘనంచ శీర్షం, బట్టతలంచ వ్యక్తిః,
అహర్నిశంచ పొగచుట్ట సేవనం,
మాంసంచ, వెన్నం,రొట్టంచ భోజ్యం,
విమానయానం, ప్రాగ్దేశగామీ,
సంక్రాంతిపురుషో, సమర్థైకధ్యానీ,
ఏతత్ఫలం భారతదేశ దాస్యం.

-చిత్రగుప్తుడు

# సాయిబాబా పై విమర్శా?

హైదరాబాద్‌లో ఇటీవల జరిగిన ఒక కార్యక్రమంలో మన దేశ ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు దేశ ప్రజల పరువు తాకట్టు పెట్టే విధంగా శ్రీ సాయిబాబా కాళ్లకు మొక్కినట్లు 'జమీన్‌రైతు' లో విమర్శించారు. ఆ వార్తలో పేర్కొన్నట్లు రాజ్యాంగం, లౌకికతత్వాన్ని ప్రక్కన బెట్టి భారతదేశ చరిత్ర, సంస్కృతి ఒకసారి సింహావలోకనం చేసుకోవాలి. ఈ దేశంలో ఎప్పటి నుంచో కాషాయాంబరధారికి అత్యంత గౌరవస్థానం వుంది. చక్రవర్తుల మొదలు ఛత్రపతి శివాజి వరకు సన్యాసులు, మహర్షులు ఎదురు పడితే సాష్టాంగ దండ ప్రమాణం చేసినవారే. ప్రస్తుతం మనదేశంలోని స్వామిజీలను, బాబాలను విదేశస్తులు ఎంతో గౌరవిస్తున్నారు. ప్రభుత్వ అధినేతలు చట్టసభల్లో వారి అధ్యాత్మిక ప్రసంగాలు ఇప్పిస్తున్నారు. ఇక సాయి బాబా గారు గాలి నుండి దండలు, వుంగరాలు తీసి ఇస్తారని విమర్శిస్తున్నారు. ఆ పని మరొకరికి చేత కాదు గదా? ప్రముఖ ఇంద్ర జాలికులు డాక్టర్ పట్టాభిరామ్ సైతం బాబా వెంబడి 103 రోజులుండి భూమిపై అవతరించిన భగవదావతారం అని అనడం ఒకసారి పరికించాలి. ఇక బాబా గారి సేవా కార్యక్రమాల గూర్చి ప్రపంచంలో వల్లెత్తు మాట ఎవరూ అనలేరు సుమా.

ఆర్. మాలకొండయ్య

కోవూరు

## జనవాణి

### కోట్ల ముందు మూడు సమస్యలు

గతవారం జమీన్‌రైతులో తాటికాయంత అక్షరాలతో 'కోట్లకే కిరీటం' అని వ్రాసిన మాట అక్షరాలా రుజువైంది; దాదాపు పదేళ్ల తర్వాత తిరిగి రాష్ట్ర రాజకీయాలలో ప్రవేశిస్తున్న నూతన ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి గారికి రాష్ట్ర ప్రజలందరూ అభినందనలు తెల్పుతున్నారు.

కొత్త ముఖ్యమంత్రి ఎదుట ప్రధానంగా మూడు సమస్యలున్నాయి. ఒకటి కిలో రెండు రూపాయలకే తిరిగి బియ్యం ఇవ్వటం; మునిసిపాలిటీలలో కొత్తగా విధించిన అపరిమిత పన్నుల పెంపును తగ్గించడం; సారాయిపై నిషేధం విధించడం. ఈ మూడు సమస్యలను చాకచక్యంగా పరిష్కరించగల్గితే, ఆయన నాయకత్వంలో కాంగ్రెస్ పార్టీకి పునరుజ్జీవనం సిద్ధిస్తుంది; ఇందులో విఫలమైతే పదేళ్ల క్రితం జరిగినట్లే కాంగ్రెస్‌కు ఆయన చేతుల మీదుగా అంత్యక్రియలు జరుగుతాయి.

నెల్లూరు - కె. పోలిరెడ్డి

### రీడింగ్ రూమ్ తరలించ కూడదు

బాలాజీ నగర్ పాలబూత్ సెంటర్ వద్ద గత సంవత్సరం ఏర్పాటు చేసిన మున్సిపల్ రీడింగు రూమ్ తీసివేయడం తగదు. అటు ఎసినగర్, ఇటు బాలాజీ నగర్ ప్రజలకు ఇది ఎంతో ఉపయోగ పడుతున్నది. రీడింగు రూము స్థానంలో కట్టదలచిన మరో నిర్మాణం వేరొక చోటకు మార్చుకొంటే బాగుటుంది.

-[illegible]

నెల్లూరు.

జెంట్స్ రెడీమేడ్స్

సూటింగ్స్ & షర్టింగ్స్

షర్ట్స్, ట్రౌజర్స్, జీన్స్, కుర్తా సెట్స్, టీ-షర్ట్స్

విమల్ జంక్షన్

కాపువీధి :: నెల్లూరు. ఫోన్ : 25420

# మరుపూరు ముదుసలి కాదు, తొంభై ఏళ్ళ యువకుడు!

వయస్సుపైన పడే కొద్దీ మానసిక యువ్వనంతో వికసించి లాదుతున్న మన మరుపూరు కోదండ రామిరెడ్డిని ఆయన మిత్ర బృందం 3 తేది టౌన్‌హాలులో ఘనంగా సత్కరించింది. టౌన్‌లోని సాహిత్య పిపాసువులు, పాత్రికేయులు, సేవా సంఘాల నిర్వాహకులు, మిత్రులు, అభిమానులలో సభావరణం కళకళలాడింది. ఆ రోజుతో మరుపూరుకు 90 [illegible] 91 [illegible] మందికి వస్తుంది. అంతటి అదృష్టం? మరుపూరు ఎప్పటికీ మునలివారు కారు. కాలేరు. ఆయన తొంభై ఏళ్ల నవ యువ్వనుడు.

ఈ సభను డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షించారు. అర్బన్ చైర్మన్ శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డి, జనకల్యాణ్ అధ్యక్షుడు శ్రీ కొండా బలరామిరెడ్డి, న్యాయవాది శ్రీ పి.వి.రమణారెడ్డి, సర్వోదయ కాలేజి కరస్పాండెంట్ శ్రీ ఎర్రపల్లి గోవింద శెట్టి, శ్రీ ఎం.వి. నారాయణ రెడ్డి, శ్రీ చల్లగుండ్ల రామచంద్రయ్య, డాక్టర్ పి.వి. రామచంద్రరావు తదితరులు వల్లటి మాటలు, కొత్త గుడ్డలు, చిన్న, చిన్న కెరెన్సీ పొట్లాలతో మరుపూరును సత్కరించారు. శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి అభినందన పత్రం చదివారు; వర్ధమాన సమాజ కార్యదర్శి శ్రీ నరసింహులు స్వాగత వందనాలాచరించారు.

### విఆర్ కాలేజి దగ్గర అపోలో విభాగం

అపోలో హాస్పిటల్ సేవలను నెల్లూరీయులకు మరింత సన్నిహితం చేసే ఉద్దేశ్యంతో టౌన్‌లో ఒక విభాగం ప్రారంభించారు. విఆర్ కాలేజి దగ్గర, స్వర్గీయ రఘురామిరెడ్డి, కంటి ఆస్పత్రి భవనంలో 'అపోలో మెడికల్ సెంటర్' తెరిచారు. అపోలో సీనియర్ డాక్టర్, శ్రీ చంద్రశేఖర రెడ్డి దీనికి 1 తేది రిబ్బను కత్తిరించారు. శ్రీ మతి మాణిక్యమ్మాళ్ జ్యోతి వెలిగించారు. ఆస్పత్రి ఎం. డి

## సింహపురి

డాక్టర్ వి. గోపాలరెడ్డి, ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ శ్రీ పి. కృష్ణారెడ్డి, శ్రీమతి పి. ఊర్మిళారెడ్డి తదితరులు సభలో పాల్గొన్నారు.

ఈ సెంటర్‌లో అపోలో డాక్టర్లు ఉదయం 11 నుంచి 1 గంట వరకు, సాయంత్రం 4 గంటల నుంచి రాత్రి8గంటల వరకు అందుబాటులో వుంటారు. కార్డియాలజీ, ఇఎన్‌టి, చిన్నపిల్లలు ,స్త్రీల నిపుణుల నుంచి సాధారణ ఫిజీషియన్, సర్జన్ల వరకు అన్ని విభాగాల డాక్టర్లు సెంటర్‌లో వుంటారు.

### సాయిబాబా మహోత్సవాలు

టౌన్‌లోని శ్రీ షిర్డిసాయి బాబా మందిరంలో బాబా 74 వ సమాధి మహోత్సవాలు సోమ, మంగళ, బుధ వారాల్లో ఘనంగా జరిగాయి. 5 తేది ఏకాదశి రుద్రాభిషేకం, సహస్ర నామార్చన జరిగింది. రాత్రి కూచిపూడి, జానపద నృత్య ప్రదర్శనలు జరిగాయి. 6 తేది సాయి భక్తి, భావ వల్లరి, 7 తేది సహస్ర దీపాలంకరణ భారీ ఎత్తున జరిగాయి.

### శ్రీనాథ జయంతి

నెల్లూరు వర్ధమాన సమాజం ఆధ్వర్యంలో స్వర్గీయ పొలంరెడ్డి యశోధర స్మృత్యంకంగా శ్రీనాథ జయంతి సభ 2 తేది టౌన్ హాలులో ఘనంగా జరిగాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడర్ డా. పి. సుమతీ నరేంద్ర సమావేశాన్ని అధ్యక్షించారు. ప్రముఖ రచయిత్రి శ్రీమతి సి. వేదవతి 'సాహిత్యంలో బాలకృష్ణ భావన' అనే అంశంపై ఉపన్యసించారు. ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీనాథ జయంతి ట్రస్ట్ బోర్డు అధ్యక్షుడు శ్రీ. ఎ. నరేంద్రనాథ్ తదితరులు కార్యక్రమంలో పాల్గొన్నారు. వర్ధసమాజం వందన శ్రీ బి.వి. నరసింహులు వందన సమర్పణ కార్యక్రమము చేశారు.

## సణుగుడు

* 94 ఎన్నికలకు అప్పుడే 'ఈనాడు' రంగం సిద్ధం చేస్తున్నది.

* కాంగ్రెస్ నాయకులకేమైనా లోకం తీరు అర్థమౌతున్నదా?

రాష్ట్రంలో సారాయి నిషేధం అమలు జరిపే వరకు కలానికి విశ్రాంతి నివ్వనని 'ఈనాడు' దిన పత్రిక ప్రతినబూనింది. చూశావా?

పత్రికారంగం నిర్వహించ వలసిన సామాజిక బాధ్యతను ఈ రూపంలో నెరవేర్చాలనుకుంటున్నారేమో మరి!

నీకు తెలిసింది అంత వరకే. ఆ పత్రికలోనే ఒక వాక్యం వుంది - సారాయి నిషేధించే దమ్మున్న వారికే పై ఎన్నికల్లో మహిళలంతా ఓట్లువేయాలట.

82 లో ఆంధ్రుల ఆత్మగౌరవం నినాదం, 92 లో ఆంధ్రమహిళలపై అవ్యాజానురాగం!

అసలు అధికారంలోకి రావడానికి ఎన్టీఆర్, 'ఈనాడు'లు అంతటి పథక రచనలు చేయాల్సిన అవసరం వుందంటావా?

అదీ నిజమే. ఆంధ్రలో పరిపాలన మాకు చేతకాదు బాబో అని కాంగ్రెస్ వారు ఊరూరా దండోరా వేసి మరీ చెప్తున్నారు. ఎన్నికల నాటికి ఎన్టీఆర్ ఇల్లు కదలాల్సిన అగత్యం రాకుండా, చైతన్య రథమెక్కి తిరిగే శ్రమలేకుండా తామే పువ్వుల్లో పెట్టి అప్పచెప్పబోతున్నారు కూడా!

సుస్థిర ప్రభుత్వ నినాదాన్ని సగర్వంగా ప్రజల్లో నినదింపజేసిన పార్టీయేనా ఇది?

కాంగ్రెస్‌లో ప్రభుత్వం సుస్థిరం. ముఖ్యమంత్రులే అస్థిరం.

అంతంత త్వరగా నాయకులను మార్చడం, అధిష్టాన వర్గానికి ఏమి సరదా?

## డోలేంద్ర

అది సరదా కాదు, సోషలిజం. అధికారంలో వుండే అతికొద్దికాలంలో ప్రజాసేవ చేసే అవకాశం వీలైనంత ఎక్కువ మందికి పంచి ఇవ్వాలనే సదుద్దేశ్యంతోనే ఢిల్లీ నేతలు ఈ మార్పులు చేస్తుంటారు. వున్నదంతా ఒక్కడే తింటే, తక్కినవారికి అన్యాయం జరిగిపోదా?

కార్పొరేషన్ మేయర్ల వలె కాంగ్రెస్ ముఖ్యమంత్రులకూ ఏడాది

కొరవ 8 పేజీలో

# ప్రపంచమంతా తినేది మన మామిడి పండే!

## రైతులోకం

## మామిడి తోట నెట్లా పెంచాలి?

*డాక్టర్ సిద్దారెడ్డి ఈశ్వరరెడ్డి*

గతంలో నెల్లూరు జిల్లాలో మామిడి తోటలు విస్తారంగా ఉండేవి. కొంతకాలం క్రితం, లాభదాయకం కాదనే ఉద్దేశ్యంతో ఈ తోటలు తీసివేసి వరిపొలాలుగా మార్చి వేశారు. ఇప్పుడు మళ్ళీ మామిడి తోటల వైపు జిల్లా రైతాంగం దృష్టి సారిస్తున్నది.

ఇతర జిల్లాలతో పోలిస్తే నెల్లూరు జిల్లాలో వ్యవసాయ యోగ్యమైన బీడు భూములు ఎక్కువ. అందుకని మిగతా జిల్లాల రైతులు కూడా, ఇక్కడ చవకగా పొలాలు కొని, పండ్ల తోటలు పెంచుతున్నారు.

అరటి తర్వాత మన సంస్కృతి, సాంప్రదాయాలతో ముడివేసుకున్నది మామిడి మాత్రమే. భారత ఉపఖండంలో గత నాలుగు వేల సంవత్సరాల నుంచీ మామిడి సాగు చేయబడుతున్నది. క్రీస్తు పూర్వం 327 లో అలెగ్జాండరు సింధులోయలో మామిడిని చూసినా, గౌతమ బుద్ధుడికి మామిడి వనాన్ని ఆమ్రధరికి బహూకరించినా, మామిడికి మహోన్నత స్థానాన్ని కల్పించింది. అక్బరు (1556-1605) మహా రాజీనవి చరిత్ర కారుల కథనం; దర్భాంగా (బీహారు) వద్ద లక్ష మామిడి మొక్కలతో చాలా విస్తారమైన తోటను పెంచాడు అక్బర్ సామ్రాట్.

ఆయన ఆస్థాన కవి అబుల్ ఫజల్ వ్రాసిన "ఐన్- ఇ - అక్బరి" పర్షియన్ భాషలో ఉన్న గ్రంథాల్లో ఉత్కృష్టమైనది. అందులో మామిడి రకాలు, సాగు వాణ్యతల గురించి చాలా వివరంగా వర్ణించ బడింది (క్రీ.శ. 1590) జిల్లాలో వ్యాపిస్తున్న మామిడి తోటల పెంపకం గురించి, ఇప్పుడు తెలుసు కుందాం.

మన దేశం నుండి 40 దేశాలకు మామిడి పళ్లను ఎగుమతి చేస్తున్నాం. ప్రపంచంలో ఉత్పత్తి అయ్యేమామిడి పళ్లలో 64 శాతం మన దేశమే, పండిస్తున్నది.

### అనువైన నేలలు

మామిడికి వ్యవసాయ యోగ్యమైన అన్ని నేలలూ అనుకూలమే.

లోతైన నేలల్లో, వేరు బాగా వ్యాపించి, తడి త్వరగా ఆరిపోదు కనుక, మొక్కలు నీటి ఎద్దడికి గురి కావు. నీరు నిలిచే పొలాల్లోనూ మురుగు నీరు తీసివేసేందుకు అనువులేని పొలాల్లోనూ, చౌడు, ఉప్పు నేలల్లోనూ మామిడిని పెంచరాదు. ఆరు అడుగుల లోపల, రాతి పొరలు, సుద్ద ఉన్నచో తోటలు త్వరగా క్షీణిస్తాయి. అందువల్ల నేల నమూనాలను నాలుగు అడుగుల వరకు, ప్రతి అడుగుకు సేకరించి పరీక్ష చేయించుట మంచిది.

### నేలతయారి

విరగబడి పోతుంది. కనుక, దానికన్నా కీమచింత మొక్కలను కంచెగా నాటుకోవడం మంచిది. మనది తుఫాను తాకిడికి గురి అయ్యే ప్రాంతం కనుక, తోట చుట్టూ విధిగా గాలి నిరోధకాలుగా, ఎత్తుగా ఎదిగే మొక్కలను నాటుకోవాలి. అందుకు గాను టేకు, మొక్కలను తోట చుట్టూ దగ్గర దగ్గరగా నాటడం మంచిది. లేదా, సరుగుడు, అల్లనేరేడు, కొబ్బరి చెట్లు కూడా మంచివే.

### గుంటలు తవ్వడం

నేల సారాన్ని, నాటదల్చుకున్న రకాన్నిబట్టి మొక్కల మధ్య 6 నుంచి 10 మీటర్ల దూరం ఉంచాలి. అంత దూరంలో 1 x 1 x 1 మీటరు గుంటలు తవ్వి, ప్రతిగుంటకు 25 కిలోలు బాగా చీకిన పశువుల ఎరువు, 1 కిలో సూపరు ఫాస్ఫేటు, 2 కిలోల వేపపిండి, 20-30 గ్రాముల బి.హెచ్.సి. 10 శాతం పొడిని, గుంట నుంచి తీసిన మట్టితో కలిపి, తిరిగి గుంటను నింపి, నీరు పెట్టాలి. ఎన్నుకొన్న పొలం సారవంతం అయినది కాకుంటే గుంట నింపేటప్పుడు, అదే మట్టి కాకుండా, బయట నుంచి మంచి మట్టి తెచ్చి నింపాలి.

### మొక్కలు నాటడం

నాటేందుకు నాణ్యమైన అంటు మొక్కలను, నమ్మకమైన నర్సరీల నుంచి తెచ్చుకోవాలి. పొడుగ్గా ఉన్న మొక్కలే కావాలని లేదు అది అపోహ మాత్రమే. ఎన్నుకున్న అంటు మొక్కలు ధృడంగా, ఆరోగ్యంగా ఉండాలి. చిదలు, తెగుళ్ళు సోకనివిగా ఉండాలి అంటుకట్టిన భాగం ఖాళీ లేకుండా, గట్టిగా అతుక్కొని ఉండాలి. అంటుకట్టిన భాగం క్రింద నుంచి వచ్చిన రెమ్మలను తీసి వేయాలి.

సాధారణంగా మామిడి మొక్కలను జూన్ నుంచి డిసెంబరు వరకు నాటవచ్చు. మనది తుఫాను ప్రాంతం కనుక అక్టోబరు – నవంబరు నెలల్లో నాటితే మంచిది. ఐతే జూన్–జూలై నెలల్లో నాటి తుఫానుల నుంచి రక్షణ కల్పించ గలిగితే, అప్పుడు కురిసే వర్షాల వల్ల అంటు మొక్కకు కావలసినంత నీరు అంది, ఎదుగుదల బాగా ఉంటుంది.

మొక్కలు నాటే సమయంలో, వాటి వేళ్లు కదలకుండా కుండీల నుంచి తీయాలి లేదా పాలిథీను సంచులలో ఉన్న మొక్కలైతే, సంచి అడుగుభాగం బ్లేడుతో కోసి వేస్తే సరిపోతుంది. ఎలా చేసినా వేళ్ల చుట్టూ ఉండే మట్టి కదలరాదు. మొక్కను గుంట మధ్యలో, అంటుభాగం, నేలపైన 6 అంగుళాలు ఉండేటట్లు నాటాలి. మొక్క చుట్టూ బాగా అదిమి, గాలికి పడిపోకుండా కర్రను పాతి, కదలకుండా కట్టాలి. నాటిన వెంటనే ఒక అడుగు ఎక్కగా చల్లాలి. దీనివల్ల లేత మొక్కలను అధిక ఎండ నుంచి కాపాడవచ్చు. ఎండాకాలం తర్వాత తొలకరి వానలప్పుడు జనుమును నేలలో కలియదున్నాలి.

### ఎరువులు

బాగా చివికి పశువుల ఎరువు, ఆముదము, వేపపిండి వంటివి వేయుట మంచిది. మొక్క వయసును బట్టి ప్రతి సంవత్సరం వేయాల్సిన ఎరువులు

| వయసు | పశువుల ఎరువు కిలోలు | నత్రజని గ్రాములు | భాస్వరం గ్రాములు | పొటాష్ గ్రాములు |
|---|---|---|---|---|
| మొ.సం. | 20 | 100 | 200 | 50 |
| | 30 | 200 | 400 | 100 |
| | 40 | 400 | 800 | 200 |
| | 50 | 600 | 1200 | 300 |
| | 60 | 800 | 1600 | 400 |
| | 100 | 1000 | 2000 | 500 |

ప్రతి సంవత్సరం, కాపుకు వచ్చేంత వరకు, నత్రజని, భాస్వరం ఎరువులను సమాన భాగాలుగా చేసి, జూన్, ఆగస్టు, అక్టోబరు, డిసెంబరు, ఫిబ్రవరి నెలల్లో వేయడం మంచిది. కాపుకు వచ్చిన తోటల్లో జూలై–ఆగస్టు నెలల్లో పైన చెప్పిన ఎరువులను వేయాలి. చెట్టు విస్తరించిన మేయన, పాది చేసి 15 సెం.మీ. లోతుగా ఎరువులను వేయడం వల్ల అవి సమర్థవంతంగా మొక్కలచే వినియోగించుకో బడతాయి. చెట్లు పూతతో ఉన్నప్పుడు, కాయ ఎదిగే దశలోను, కాయలు కోసిన తరువాత 2 శాతం యూరియాను మొక్కల మీద పిచికారి చేయడం మంచిది.

### నీరు కట్టడం

నీరు కట్టకుండా వర్షం మీద ఆధారపడ్డ తోటలకంటే, క్రమం

కొరవ 8 పేజీలో

## [illegible]

### రంగాగారికి అనారోగ్యం

రైతుబాంధవుడు ఆచార్య రంగాపిమ్మట మరెవరైనా ఇంట్లో కాలుజారి క్రిందపడి, స్వల్ప అనారోగ్యానికి గురైనారు; ప్రస్తుతం కులాసాగానే వుంది.

రంగాగారు శీఘ్రంగా కోలుకొని, పరిపూర్ణ ఆరోగ్యంతో, మనమధ్య మామూలుగా తిరగాలని ఆకాంక్షిస్తున్నాము.

### జనార్ధనరెడ్డి నెల్లూరు రాక

మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి 16తేది వాకాడు వస్తున్నారు. స్వర్గీయ నేదురుమల్లి బాలకృష్ణారెడ్డి కుమారుడి వివాహంలో పాల్గొనేందుకు వస్తున్నారాయన. 15తేది రాత్రి మద్రాసుకు వచ్చి, కారులో 16తేది ఉదయం వాకాడు చేరుకుంటారు;బహుశా అదేరోజు సాయంత్రం తిరిగి వెళ్తారు. కార్యక్రమాలేమీ లేవు

### నెల్లూరు ఎమ్మెల్యేల స్వాగతార్భాటం

హఠాత్తుగా మారిన రాష్ట్ర రాజకీయం నెల్లూరు జిల్లా ఎమ్మెల్యేల వరకు అయోమయం సృష్టించింది. ఇప్పటివరకు వారంతా మర్రిచెట్టు క్రింద మొలకల వలె వుండినారు. జనార్ధనరెడ్డి ముఖ్యమంత్రి కాక మునుపు కూడా జిల్లా నాయకత్వం ఆయనదే కాబట్టి, ఎమ్మెల్యే లెవరూ స్వంత ప్రయత్నాలు చేసేవారు కారు. ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. అందుకే ఎవరి తంటాలు వారు పడుతున్నారు. విజయభాస్కరరెడ్డిని స్వాగతించను విమానాశ్రయం వెళ్లడంలోనే నెల్లూరు ఎమ్మెల్యేల నూతన వైఖరి స్పష్టమైంది. అందరూ పోటీలు పడి దండలు తీసుక వెళ్లారు. మంత్రి శ్రీమాదాల జానకిరాం మంచిబోకేను స్వీకరించడమే కాకుండా, ప్రత్యేకంగా ఆలింగనం చేసుకున్నాడు కొత్త ముఖ్యమంత్రి. 1982నాటి పాత స్నేహం గుర్తుకు వచ్చిందో లేక మంత్రి పదవి ఇవ్వడం ఎటూ జరగదు కాబట్టి, ఈ రూపంలో తన అభిమానాన్ని చాటాలనుకున్నారేమో తెలియదు మరి! జకెరెడ్డి గారిని కూడా విజయభాస్కరరెడ్డి ప్రత్యేకంగా పలకరించి, క్షేమ సమాచారాలు అడిగాడట. కావలి యానాదిరెడ్డి గారు గతవారం నుంచే విజయభాస్కరరెడ్డి కరుణా కటాక్ష వీక్షణాల కోసం ప్రదక్షిణలు చేస్తున్నారు. యానాది రెడ్డి గారి కెందుకో కొత్త నాయకుడిపై అపరిమిత ఆశవుంది- పరోన్నతి పదం ప్రసాదిస్తారని!

వెంకటరత్నం నాయుడు గారు కూడా శక్తి వంచన లేకుండా విజయభాస్కరరెడ్డి దృష్టిలో పడటానికి ప్రయత్నిస్తున్నారు. జనార్ధనరెడ్డిని మాటసాయం కూడా కోరినట్లున్నారు.

సుందరరామరెడ్డి గారు 'పెద్దతోడు'తో కలిసి వైఎస్ రాజశేఖరరెడ్డిని సందర్శించినట్లున్నారు. అది తొందర పాటే అయింది. విజయభాస్కరరెడ్డి దగ్గరకి ఆ 'పెద్దతోడు' రాదు;వచ్చినా వ్రతం చెడడం తప్ప ఫలం దక్కదు. వంటరివారై ఇబ్బంది పడుతున్నారు పాపం!

సివిశేషారెడ్డి భూమి చుట్టు తిరగడం కంటే శివుడి చుట్టు ప్రదక్షిణం చేయడం వల్ల అధిక పుణ్యం పొందవచ్చన్న మర్మం తెలిసిన వాడు; జనప్రియలో జనార్ధనరెడ్డి కనుసన్నలలోనే మెలగుతున్నాడు. నెల్లూరులో మాత్రం రెండు రోజులనుంచి ఆయన మంత్రి అయినట్లు అనుచరులు హడావుడి చేస్తున్నారు.

### యానాదిరెడ్డి నిరసన

తనకు మంత్రి వర్గంలో చాన్సు ఇప్పించమని 8తేది రాత్రి, 9తేది ఉదయం కావలి ఎమ్మెల్యే శ్రీకలికి యానాదిరెడ్డి జనార్ధనరెడ్డిపై తీవ్ర వత్తిడి తెచ్చారు. అల్లూరు ఎమ్మెల్యే శ్రీ విష్ణువర్ధనరెడ్డి ఆయనకు బాసటగా నిల్చారు. ఎంత ప్రాధేయపడినా, బ్రతిమలాడినా, నయానా భయానా అడిగి చూచినా జనార్ధనరెడ్డి మెత్తబడక పోయేసరికి, నిరసన తెల్పివెళ్లారట ఎమ్మెల్యే లిద్దరూ!

* * *

సివిశేషారెడ్డి అభిమానులు- మంత్రిత్వం ఖాయమనే నమ్మకంతో- నెల్లూరు, ముత్తుకూరు, ఇందుకూరు పేటలలో ఉత్సవాలు జరపడానికి బెట్లు,గివుట్లతో సహా రెడీగా వుండినారు;వారికి తీవ్ర ఆశాభంగం ఎదురైంది పాపం!

* * *

విజయాబ్యాంకు అప్పుల కుంభకోణం, సిబిఐ దర్యాప్తు శ్రీమాదాల జానకిరాం మంత్రిత్వాన్ని బలితీసుకున్నాయి. ఈ న్యూసెన్సు లేకుంటే జానకిరాం పేరు జాబితాలు మొదటిగా వుండేది.

### చచ్చిన టెలిఫోన్లు

ఈ మధ్య నెల్లూరు టవున్‌లో టెలిఫోన్ల పరిస్థితి పరమ అధ్వాన్నంగా వుంది. బాగుండే వాటికంటే, బాగలేని వాటి సంఖ్య ఎక్కువగా వుంటున్నది. చెప్పుకున్నా, మొత్తుకున్నా, గోపెట్టుకున్నా వినే నాథుడు. బాగుజేసి వుద్యోగి వుండడం లేదు. ఫోన్ చెడిపోతే, రోజుల పర్యంతం లేకుంటే వినియోగదారులకు ఎంత అసౌకర్యమో, ఎంత నష్టమో, ఎంత కష్టమో టెలిఫోన్ శాఖ గ్రహించలేక పోవడమే ఈ దుస్థితికి కారణం.

సరిగ్గా ఈ రోజుకు పన్నెండు రోజులు – దర్గామిట్ట ప్రాంతంలో ఫోన్లు చచ్చి! ఒకటిరెండూ కాదు రెండు వందలట! ఎక్కడో కేబుల్ ఫాల్ట్ అన్నారు; ఎక్కడైంది ఎరకలేదన్నారు; చివరకు మూడు నాలుగు రోజుల క్రితం పట్టుకోగలిగామన్నారు; ఒకటి రెండు రోజులలో వాటికి ప్రాణం వస్తుందన్నారు. ఏది? ఏమిటీ అస్తవ్యస్తత? ఏమిటి గుడ్డితనం? పనిజేయని ఫోన్లకు వేలకు వేలు బిల్లులు చెల్లించడం నెల్లూరు వినియోగదార్లు ఏనాటో చేసుకున్న పాపమో ననిపిస్తుంది.

దర్గామిట్టలో ఒక ఫోను చావడానికి ముందు వారం పది రోజుల నుండి సరిగా లేదు. దాన్ని బాగు చేసిన వాడు లేడు. ఇరవై రోజులపాటు దిక్కు లేకుంటే. ఈ రోజుల్లో బయట ప్రపంచంతో సంబంధం లేకుండా వుండి పోవడమే గదా! ఈ బాధలను గ్రహించి చర్య దీసుకునే వాడు లేకపోవడం శోచనీయం!

### రాజేశ్వరి తిరునాళ్ల

దర్గామిట్ట రాజరాజేశ్వరి దేవి అదృష్టం ఏమోగాని ఏటికేడాది భక్తుల రద్దీ అపరిమితమై పోతున్నది. ఈ ఏడాది బ్రహ్మోత్సవాలకైతే దేవాలయ ఆవరణలో ఇసుకేస్తే రాలలేదు. అందరు భక్తులకు దర్శనమివ్వలేక రాజేశ్వరమ్మ ఎంత ఇబ్బంది పడిందో తెలియదుగాని,వారికి సేవలు చేయలేక ధర్మకర్తల మండలి అధ్యక్షుడు శ్రీకెవి రాఘవరెడ్డి మాత్రం చిక్కి, సగమై పోయారు. ఈ ఏడాది ఏర్పాట్లు బ్రహ్మాండం. ట్రంకురోడ్డులో వెళ్లేవారి కళ్లు జిగేల్ మన్నాయి.

రాఘవరెడ్డికి రాజేశ్వరమ్మ చాలా రుణపడిపోతున్నది; ఎప్పుడు, ఏ రూపంలో తీరుస్తుందో తెలియదు మరి!

### ఎల్లసిరికి మార్కెట్ కమిటీ

గూడూరు యూత్ కాంగ్రెసీయుడు శ్రీ ఎల్లసిరి గోపాలరెడ్డి గూడూరు అగ్రికల్చరల్ మార్కెట్ కమిటీ అధ్యక్షుడుగా నియమితులైనారు. శ్రీ జి. శ్రీనివాసులు రెడ్డిని ఉపాధ్యక్షుడుగా నియమించారు. గోపాలరెడ్డి విధేయతకు జనార్ధనరెడ్డి ఇచ్చిన చిరుకానుక ఇది.

### మద్దూరు సుబ్బారెడ్డి మరణం

వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు ప్రొఫెసరు డాక్టర్ మద్దూరు సుబ్బారెడ్డి (55) హృద్రోగంతో దివంగతులైనాడనే వార్త దిగ్భ్రమగొలిపింది.

సుబ్బారెడ్డి గారు గుంటూరు జిల్లావారు. తిరుపతికి పోక ముందు నెల్లూరు వి.ఆర్. కాలేజి తెలుగు శాఖలో పనిజేశారు. అప్పటి నుండి ఆయనకు నెల్లూరంటే ప్రత్యేక అభిమానం; ఆయన నెల్లూరు జిల్లా వాసి అనే అనిపించే వారు. సౌమ్యత, సహృదయత, స్నేహశీలత సుబ్బారెడ్డి గారిలోని వుత్కృష్ట గుణాలు తనకు పరిచయమైన ప్రతి ఒక్కరికి ఆయన ఆత్మీయులై పోయే వారు. మంచి తనానికిమారు పేరు మద్దూరు! అని పించేది. మంచి వక్త ఆయన. వైస్ ఛాన్సలర్ కీ.శే. ఆచార్య జి.ఎస్. రెడ్డి, సుబ్బారెడ్డి ఒకరి ఒకరు వీడి వుండలేని సన్నిహితులు. జి.ఎస్.రెడ్డి మరణా నంతరం, ఒంటరి తనాన్ని సహించలేక, సుబ్బారెడ్డి గారు అకాలంగా స్వర్గాన వున్న జి.ఎస్. రెడ్డి ని చేరుకున్నారా అనిపిస్తుంది.

సుబ్బారెడ్డి గారు నెల్లూరులో వున్నప్పటి నుండి నేటి వరకు జమీన్‌రైతు పాఠకుడు. పత్రిక పాఠకుడు గాదు అభిమాని, శ్రేయోభిలాషి. సంతోషం అనే విద్యార్థిని పరిశోధనకు 'జమీన్‌రైతు'

[illegible] 6 పేజీలో

## బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికి విడిపించని వద్దులు

1) ఏ. నరేంద్ర కుమార్ జైన్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నం. 150డు, 7262ఎ, గిరిపురం, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 4.5.91 నుండి 22.9.91 తేది వరకు గల విడిపించని వద్దులు 15.10.92 తేది వుదయం 10 గంటల నుండి 762ఎ, గిరిపురం, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

2) జె. శాంతిలాల్ సునీల్ కుమార్ జైన్ పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 48, 18.2.67కొర్లగుంట తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 3.1.91 నుండి 30.5.91 తేది వరకు గల విడిపించని వద్దులు 19.10.92 తేది వుదయం 10 గంటల నుండి 18.2.67 కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

3) జి. మాణిక్‌చంద్ పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 137, 19.6.18ఎ,యస్.టి.వి. నగర్, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 12.1.91 నుండి 25.6.91 తేది వరకు గల విడిపించని వద్దులు. 20.10.92 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి19.6.18ఎ, యస్.టి.వి. నగర్, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

4) జె.యస్. కమలాభాయిజైన్, పి.బి.యల్. నం.49, 18.2.67కొర్లగుంట, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి2.1.91 నుండి 31.5.91 తేది వరకు గల విడిపించని వద్దులు. 21.10.92 తేది వుదయం 10 గంటల నుండి 18.2.67కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

5) బి. షేవర్‌లాల్ పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 289, 19.7.99డి,రాయలచెరువు రోడ్డు, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 5.12.90 నుండి 14.9.91తేది వరకు గల విడిపించని వద్దులు. 21.10.92 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి 19.7.99డి, రాయలచెరువు రోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

6) జె. శాంతిలాల్ జైన్ పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 29, జి.యం. వీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 28-1288 నుండి 26.6.91 తేది వరకు గలవిడిపించని వద్దులు 22.10.92 తేది వుదయం 10 గంటల నుండి బి.జి.యం. వీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

7) యన్. కన్హయలాల్ చౌదరి పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 179, 14.3.286 యస్.టి.వి. నగర్, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.1.91 నుండి 29.6.91 తేది వరకు గల విడిపంచని వద్దులు.

22.10.92 మధ్యాహ్నం 2 గంటల నుండి 14.3.286 యస్.టి.వి.నగర్ తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

8) వి. పేమారామ్ చౌదరి పాన్ బ్రోకర్సు, పి.బి.యల్.నం. 143, 20.5.585ఎ, కొర్లగుంట తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 20.2.91 నుండి30.8.91 తేది వరకు గలవిడిపించని వద్దులు 24.10.92 తేది వుదయం 10 గంటల నుండి 20.2.585ఎ, కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

9) వి. బుదారామ్ చౌదరి పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 180, 20.3.124బి, అకారామ్‌పల్లి రోడ్డు – తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.4.91 నుండి 27.9.91 తేది వరకు గల విడిపించని వద్దులు 24.10.92 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి 20.3.124బి, అకారామ్ పల్లి రోడ్డు, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

10) శేట్ శివరాజ్ మనరూప్‌జి, పి.బి.యల్. 17/88-89, 14/66కాపువీధి, నెల్లూరు వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి9.1.88 నుండి4.6.91 తేది వరకు గల విడిపించని వద్దులు 30.10.92 తేది వుదయం 10 గంటల నుండి 14/66 కాపువీధి, నెల్లూరులో బహిరంగముగా వేలము జరుపబడును.

11) జి. సర్దార్‌మల్ సంఘ్వి పాన్ బ్రోకర్సు, పి.బి.యల్. నం. 6801/82, 5/387, మదరాసు రోడ్డు – కోడూరు కడప జిల్లా వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.12.89 నుండి 14.7.90 తేది వరకు గల విడిపించని వద్దులు 9.11.92 తేది వుదయం 10 గంటల నుండి 5/387 మదరాసు రోడ్డు, కోడూరు, కడప జిల్లాలో బహిరంగముగా వేలము జరుపబడును.

12) హెచ్. అంబాలాల్ ఫైనాన్స్ పాన్‌బ్రోకర్సు, పి.బి.యల్. నం. 2/88, 6/22ఎ(2), బజారువీధి, వి.కోట, చిత్తూరు జిల్లా వారి తాలూకు వేలములోగా ప్రకటించిన ప్రకారం 4.10.92 కారణాంతరములన వేలము 5.11.92 తేది వుదయం 10 గంటల నుండి 6/22ఎ(2), బజారువీధి, వి.కోట, చిత్తూరు జిల్లాలో బహిరంగముగా వేలము జరుపబడును.

కె.వి. రామకృష్ణారావు
ప్రభుత్వము నియమించిన వేలముదారు
11/268, సంతపేట, నెల్లూరు.


సంధ్యా దీప బెంగుళూరు

తమ ఇంటి యందు ఆదరణ, ఆప్యాయతకరమైన 50 సంవత్సరములు దాటిన స్త్రీలకు వసతి గృహము. ఆహ్లాద కరమైన వాతావరణము. సుందరమైన పరిసరాల మధ్య ఆధునికంగా నిర్మించబడిన భవన వసతి కలదు.

అన్ని వివరములకు
Smt. Sulochana Reddi
65/6, 2nd Cross, Lalji Nagar, BANGALORE - 30
Tel: 236751

## త్రాగుడు

(2 పేజీ కొరవ)

ప్రకాశం ఈ ఏడాది 45లక్షల లీటర్ల వరకు సారాయి అమ్ముడుపోతుందని అంచనా. అంటే గత సంవత్సరం కంటే దాదాపు రెండు లక్షల లీటర్లు ఎక్కువ.

ఇంకొక ప్రక్క జిల్లాలో కాపుడు సారాయిఅమ్మకాలు జోరుగా జరుగుతున్నాయని ఆలజడిగా వుంది. ఈ విజాన్ని ఉద్యమ నాయకులూ అంగీకరిస్తున్నారు. గంజాయి వంటి ప్రమాదకర మత్తు పదార్థాల సేవనం ప్రబలుతున్నది. కిల్లీబంకుల్లో సిగరెట్లు అమ్మినంత సులభంగా గంజాయి, ఇతర డ్రగ్స్ రకాలు అమ్ముతున్నారు. సారాయి ఫ్లాహాయిజన్ అయితే, ఈ మత్తుపదార్థాలు ఇన్స్టంట్ విషం వంటివి. తమను సేవించే వారిని మానసికంగా, శారీరకంగా నిర్వీర్యులను చేసి, స్వల్పకాలంలో మృత్యుముఖంలోకి నెట్టే భయంకర విష పదార్థాలివి. సారాయి ఉద్యమ ఫలితం-గంజాయి సేవనం. కల్తీసారా త్రాగడం అయితే మాత్రం, ఉద్యమం వల్ల సమాజానికి మేలు కంటే కీడే ఎక్కువ జరుగుతుంది. ఉద్యమ నిర్మాణంలోని లోపాలు, అసమగ్రతలే, ఈ విషపరిణామాలకు కారణం. కుటుంబ బాధల ఆవేదాగ్ని నుంచి మహిళల మానసాలలో బ్రద్దలైన అగ్నిపర్వతం

మారిరి ఉద్భవించిన ఈ ఉద్యమం మహిళల వరకే పరిమితమై వుంటే ఫలితం వేరుగా వుండేది. కానీ, అది జరగ లేదు. ఉద్యమంలోకి రాజకీయ పార్టీలు, నాయకులు, తీవ్రవాదులు జొరబడ్డారు. వారి లక్ష్యం సారాయి మానడం కాదు-గ్రామాలలో పేద మహిళల అభిమానాన్ని చూరగొని, ఓట్ల సంఖ్య పెంచుకోవడం. కామ్రేడ్ల వధకాలకు అదినుంచి విలయమైన రామచంద్రారెడ్డి ఆస్పత్రి ఈ ఉద్యమ నిర్వహణకు కేంద్రంగా మారినప్పుడే దాని మౌలిక ఉద్దేశ్యాలు పెడతోవ పట్టడం ప్రారంభించాయి. పికెటింగ్‌లు, ధర్నాల్లో ఎర్రజెండాలు రెపరెప లాడడం చూసి బిజెపి, తెలుగుదేశం నాయకులూ హడావిడిగా తమ జెండాలనూ వాటి మధ్య ఇరికించారు. వాపక్రింద నీరువలె నక్సలైట్లూ ఆందోళనా పర్వంలో తమ విషభావాల ప్రసరణ ప్రారంభించారు.

ఆందోళన పర్వంలో తమ విషభావాల ప్రసారం ప్రారంభించారు. ఈ రాజకీయాల ప్రవేశం ఉద్యమ లక్ష్యాలను నీరు గార్చింది. నాయకుల ఆధీనంలో వున్న ఉద్యమ కార్యకర్తలు వేలం కేంద్రాల వద్ద పికెటింగ్ చేయడానికి, వీధుల్లో తిరిగి నిధులు దండడానికి పరిమిత మౌతున్నారు. వాటి వల్ల వారికి కావలసిన ప్రచారం బాగా లభిస్తున్నది. గ్రామాలలో కార్యక్రమాలు లేవు. ఉద్యమ కార్యకర్తలు బృందాలుగా ఏర్పడి, గ్రామాలకు వెళ్లి, సారాయి అంగళ్లు మూయించి వస్తున్నారు. తప్ప, ఆ గ్రామంలో ప్రజలను చైతన్య వంతం చేసి, వ్యసనం వల్ల కల్గే దుష్ఫలితాలను వివరించక పోవడంతో, కార్యకర్తలు అటుపోగానే కాపుడు సారా ఇటువస్తున్నది. ప్రభుత్వ సారాయి ఏడు రూపాయలకు గాని దొరికేది కాదు; రాపూరులో కాపుడు సారా 4 రూపాయలకే లభిస్తున్నదట. పైగా ఘాటు జాస్తి. ఉద్యమ ఫలితంగా త్రాగుడు అపరిమితమై పోతున్నదని, ఎక్కడ ప్రాణాల మీదకు తెచ్చుకుంటారోనని భయమేస్తున్నదని చెప్తున్నారు. ఈ పరిస్థితి జిల్లా అంతా వుంది.

పత్రికలలో వస్తున్న ప్రచారాలు, బ్రహ్మాండంగా జరుగుతున్న ప్రదర్శనలు నాయకుల ప్రసంగాలు చూసి నిర్వాహకులు తమ ఉద్యమం విజయవంతమైందనే భ్రమలోపడి పోతున్నారు. కాని ఇప్పటి వరకు ప్రజలలో ఉద్యమ ప్రచారం తప్ప, త్రాగుడు దుష్ఫలితాల పట్ల జాగరణ లేదు; వ్యసనం మాన్పేందుకు ప్రయత్నం లేదు. ఉద్యమ నిర్వాహకులు ఈ లోపం గుర్తించి, సరిదిద్దుకోకుంటే ఎంతో కాలం ఉద్యమం నడవక పోవడమే కాదు, దాని దుష్పరిణామాలు పేద ప్రజలపై భయంకరంగా వుంటాయి.


**వరి విత్తనములు**

NLR-33057
NLR-33079

రకములు అమ్మకమునకు గలవు
అక్టోబరు/నవంబరు సీజను అనువైనవి 41/2
పుట్ల పంటలాలము

**ఎన్. శివకోటారెడ్డి**

ఫోను: 29468
C/o. ఉదయక్షేత్రైతు డిపో, సుబేదారుపేట
నెల్లూరు

**బలాది లేహ్యం**

నరములు బలహీనత గుండె దడ, ఆయాసము, బ్లడ్ ప్రెషర్, మురలుగు వానిపై పని చేయును. జీర్ణశక్తి, రక్తవృద్ధి బలము ఉత్సాహమును కలిగించును.
200 గ్రాముల సీసా రూ. 40/- మా వద్ద ప్రశస్త ఆయుర్వేద ఔషధములు లభించును.

**జనార్ధన ఆయుర్వేద ఫార్మసి**

4/607 ఉస్మాన్ సాహెబ్ పేట,
నెల్లూరు - 524 002

**పశువుల మందులు**

అన్ని ప్రముఖ కంపెనీల పశువుల మందులు మా వద్ద లభించును.

**వివేకా మెడికల్స్**

16-1295-3 పొగతోట సెంటర్,
ట్రంకురోడ్డు, నెల్లూరు.
ఫోన్: 27691


### ప్రకటన

నెల్లూరు పర్మనెంటు ఫండు లిమిటెడ్ వారు తమ 21.9.92 తేది జరిగిన సాంవత్సరిక సమావేశములో 1.4.91 మొదలు 31.3.92 వరకు జరిగిన సంవత్సరములో ఫండుతో లావాదేవీ నడిపిన షేరు హోల్డర్లకు తమ తమ షేర్లమీద రూపాయ ఒకటికి 75 పైసలు వంతున డివిడెండు యివ్వునట్లు తీర్మానించిరి.

బి.సత్యనారాయణ మూర్తి
కార్యదర్శి.

## జిల్లా వార్తలు

(2 పేజీ కొరవ)

### ఆర్టీసి బస్సుల దుస్థితి

అల్లూరు రూట్‌లో తిరిగే ఆర్టీసి బస్సులలో ఒకటి, రెండు మినహా మిగతా బస్సులు అత్యంత దయనీయ స్థితిలో ఉన్నాయి. ప్రతిరోజా బస్సులను గ్యారేజిలో శుభ్ర పరచక పోవడం వల్ల బూజుతోపాటు మట్టి పట్టి ఉంటున్నాయి. కూర్చొనే సీట్ల కుషన్ పోయి చీలలు బయట పడుతున్నాయి. కిటికీల కుండే అద్దాలు చిలుము పట్టి ఏ వైపుకు కదలక బిగుసుకు పోవడం వల్ల ప్రయాణీకులకు గాలాడని పరిస్థితి నెలకొని ఉంది. దీనికి తోడు రూటు జాతీయకరణ చేసిన తరువాత వేసిన బస్సులే నేటికీ రూట్‌మీద తిరుగుతుండడం వల్ల పాతబడి పలు పరికరాలు దెబ్బతిని నత్తనడక నడు స్తున్నాయి. నెల్లూరునుంచి 28కిలోమీటర్ల దూరంలో ఉండే అల్లూరు నుం చేరుకోవాలంటే ఒకటిన్నర గంట పడుతుంది. అదేగాక రూట్‌కు వాలిన బస్సులు లేవు. రాత్రి 9గంటలపైన ఒరోజా బస్సులుంటే; మరోరోజా ఉండవు. ఇదేమిటని అడగను ఒక అధికారి కూడా ఆత్మకూరు బస్టాండులో అందుబాటులో ఉండరు. ప్రజాసంక్షేమం కోసం పనిచేస్తున్నట్లు ఉత్తమాటలు చెప్పకొనే ఆర్టీసి ఉన్నతాధికార్లు ఈ పరిస్థితులను చక్క దిద్దాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

### వయసు మళ్లిన వారికి వసతి గృహాలు

ఉమ్మడి కుటుంబాల్లో విచ్ఛిత్తి తర్వాత వయసు మళ్లిన వ్యక్తులకు ఆదరణ కరువైన ఈ రోజుల్లో అటువంటి వారికోసం 'సంధ్యాదీప్' సంస్థను ఏర్పాటు చేశామంటున్నారు ఆ సంస్థ కమిటీ సభ్యురాలు శ్రీమతి సులోచనా రెడ్డి. బెంగుళూరు, మద్రాసు, హైదరాబాద్ నగరాలలో వీటిని ఇప్పటికే ప్రారంభించినట్లు ఆమె చెప్పారు. నామమాత్రంగా డబ్బు తీసుకొని 50సంవత్సరాలకు పైబడిన స్త్రీలను ఈ వసతి గృహాల్లో చేర్చుకొంటారట. వివరాలు ఎం.సులోచనారెడ్డి, 65/26, సెకండ్‌క్రాస్, లాల్‌జీనగర్, బెంగళూరు-30 అనే చిరునామాలో తెలుసుకోవచ్చు.

### వరమాల

మొదటి పేజీ కొరవ

లేరు; అసలు ప్రయత్నమే చేసి వుండేవారు కాదన్నా అతిశయోక్తికాదు.

వైఎస్‌రాజశేఖరరెడ్డి ఆశాభంగం, కొత్త ప్రభుత్వంపై ఏ ప్రభావం చూపుతుందో వేచిచూడాలి. ఎట్టి పరిస్థితులలోనూ ఆయన మౌనంగా ఈ అవమానం దిగమ్రింగు తాడని భావించలేము. ఈసారి వైఎస్ చాలా ఆశలో వుండినాడు. దానికి తగినట్లు ప్రధాని రాజకీయ సలహాదారు శ్రీజితేంద్ర ప్రసాద్ రాజశేఖరరెడ్డికి వారం క్రితం ఏదో హామి ఇచ్చినట్లు వినికిడి. ఆ భరోసాతో ఆయన ఎంతో ధైర్యంగా కన్పించారు. కాని పివి చాణక్యంముందు ఏ పాచికలూ పారలేదు. రాజశేఖర రెడ్డివంటి ఉద్రేక స్వభావి, దుందుడుకు తత్వం కల్గిన వ్యక్తికి రాష్ట్ర నాయకత్వం అప్పచెబితే తర్వాత చాలా సమస్యలు - ఎదుర్కోవలసి వస్తుందని పివి తన సన్నిహితులతో అన్నారట. ఇప్పటి కిప్పుడు రాజశేఖరరెడ్డి చేయగలిగిందేమీ లేదు; కొంత కాలం ఆశాభంగాన్ని దిగమ్రింగి వూరకే వుండవలసిందే!

విజయభాస్కరరెడ్డి మెడలో వరమాల పడినా, ఆ పదవిమాత్రం ఆయనకు ముళ్లకిరీటమే. రాష్ట్రంలో బలీయమైన చెన్నారెడ్డి, రాజశేఖరరెడ్డి, జనార్ధనరెడ్డి వర్గాలను సముదాయిస్తూ; శివశంకర్, వెంగళరావు వంటి సీనియర్ల అసంతృప్తికి గురికాకుండా తనను తాను కాపాడుకుంటూ రాజ్యం చేయవలసి వుంటుంది. ఎమ్మెల్యేల గొంతెమ్మ కోర్కెలు తీర్చాల్సివుంటుంది. ఆర్థిక పరమైన పాలనా పరమైన సమస్యలు సరేసరి. నక్సలైట్లు, సారాయి ఉద్యమాలు అదనపు ఆయనకు బాధ్యతలు.

### పెంచలయ్య

మొదటి పేజీ కొరవ

ఎమ్మెల్యేగా గెలవడమే కాక, నియోజక వర్గంలో చెడతిరిగి, ఊరూరా అభిమానులు, అనుచరులను సంపాదించుకున్నారు. నల్లపరెడ్లపైకి తరమ జనార్ధనరెడ్డి పక్షాన స్కడ్‌మిస్సైల్ మాదిరి దూసుక పోవడం తప్ప, ఇతర వివాదాలు వేటిలోనూ తలదూర్చేవాడు కాదు. బలహీన వర్గాలనుంచి వచ్చిన వాడైనా, అందరు హరిజన నాయకుల వలె మిలిటెంట్ కాదు. న్యాయమని తోచిన విషయంలోనే మాట్లాడుతారు. అందువల్లే పెంచలయ్య హరిజన ఉద్యమాలలో పాపులర్ కాలేదు. ఇటీవల చుండూరు దుర్ఘటనలో హరిజనుల కోపతాపాలు ఉపశమింప చేయడానికి చాలా ప్రయత్నమే చేశారు.

పెంచలయ్య జనార్ధనరెడ్డి విధేయుడు. ఎన్ని ఎగుడు దిగుడులు ఎదురైనా ప్రక్కచూపులు చూడకుండా, నిలకడగా వుండిన వాడు. ఆ లాయల్టీకి ఇప్పుడు క్యాబినెట్ మంత్రిత్వపు రాయల్టీ లభించింది. పెంచలయ్యకు మా అభినందనలు.

### పినాకినీ తీరం

2 పేజీ కొరవ

ఏమైనా జిల్లా రాజకీయాలు ఇక హుషారెక్కబోతాయి!

విజయ భాస్కర రెడ్డి మంత్రి వర్గంలో జనార్ధన రెడ్డి జిల్లాలోని తన వర్గీయులలో ఎవరికి మంత్రిత్వం

ఇప్పిస్తారు? అసలు ఇప్పిస్తారా. ఇప్పించరా? ఇప్పిస్తే ఎవరికి? సహజంగా వుత్పన్నమయ్యే ప్రశ్నలివి. దీని మీదనే జనార్ధనరెడ్డితో శాసనసభ్యుల అను బంధాలు ఆధారపడి వుంటాయి.విజయ భాస్కర రెడ్డికి జిల్లాలో తన వర్గమంటూ లేదు. ఆనం భక్తవత్సల రెడ్డి అంటే కాస్త అభిమానముండేది. పాతికేళ్లు గడిచాయి; ఆయన పైపైకి ఎదిగాడు, ఈయన వెలుగులోనే లేకుండా పోయాడు. అందువల్ల ఆ అభిమానమనేది మరచి పోయిన పాత కథ అనుకోవాలి. యానాదిరెడ్డి విజయ భాస్కర రెడ్డికి కాస్త ముఖ్యుడంటారు. మన యానాదిరెడ్డి ఏ ముఖ్యమంత్రికి, ఏ మంత్రికి, ఏ ముఖ్యుడికి, ముఖ్యుడు కాడో చెప్పండి? ఎవరి విషయంలో ముఖప్రీతి భాషణం వుండదు చెప్పండి? ఆయన స్వభావం సమయానుకూల వైఖరి. యానాదిరెడ్డి పదవి విషయంలో ఏది వ్రాయాలన్నా జంకు; అనుకూలంగా వ్రాసినా, ప్రతికూలంగా వ్రాసినా దట్టీ ఎగగట్టి, మా మీద ఎగురుతాడు. విజయభాస్కర రెడ్డి ఆయనకు మంత్రిత్వం ఇస్తాడని వూహిస్తు న్నారుగాని, అంత సులభంగా అనుకోగలమా అనిపిస్తుంది.

జానకిరాంకు ఆశలేదు; ఎత్తుకుంటూనే వివాదాన్ని విమర్శలను ఎదుర్కోడానికి విజయ భాస్కర రెడ్డి సిద్ధం కాదు. విప్ పదవికి రాజీనామా యిచ్చిన సి.వి. శేషారెడ్డికి ఖాయం అంటున్నారు. ఆనం సంజీవ రెడ్డి ఆత్మకూరు శాసనసభ్యుణ్ణి వెంట బెట్టుకొని విజయ భాస్కర రెడ్డిని తప్ప తక్కిన నాయకులందరినీ దర్శిస్తున్నా డంటు న్నారు. విజయ భాస్కర రెడ్డి – సంజీవ రెడ్డి సంబంధం నిప్పు మీద వుప్పువేసి ముఖం అర్థం పెట్టినట్లుగా వుంటుంది. పత్రా ప్రకాశరావు పేరు ప్రచారంలో లేకపోలేదు. ఒక పలుకుబడి కలిగిన కులానికి చెందిన శాసనసభ్యుడుగా సీనియర్ అయిన వెంకటరత్నం నాయుడు వుండనే వున్నారు. అయ్యే మంత్రుల జాబితాలో వినబడని వారు, జి.కె. రెడ్డి, విష్ణువర్ధన రెడ్డి, పెంచలయ్య – ఈ ముగ్గురే! ఇచ్చేవాడుంటే మంత్రిత్వానికి అనర్హులైన శాసనసభ్యులే లేరు!

జనార్ధనరెడ్డి మాట జరిగి తీరుతుంది. ఆయన ఎవరికి ఇవ్వమంటే విజయభాస్కర రెడ్డి వారికి ఇచ్చి తీరుతారు. తన జిల్లాలో తన అంతరంగికుడొకరు మంత్రి వర్గంలో వుండాల్సిన అవసరం వుందని జనార్ధనరెడ్డి భావిస్తారు. ఆ అంతరంగికుడెవరు? అది చిక్కులకు దారి తీయవచ్చు; ఒకరి కోసం అందరూ అసంతృప్తులు కావచ్చు. అందువల్ల ప్రస్తుతం ఎవరి పేరూ చెప్పకుండా వుండినా, మన జిల్లాకు మంత్రిత్వం లేకుండినా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదేమో ననిపిస్తుంది.

నాని

### నెల్లూరు ముచ్చట్లు

5 పేజీ కొరవ

మంచి వస్తువని సూచించి, ప్రోత్సహించిన మిత్రుడు. ఆమె జమీన్‌రైతు మీద రిసెర్చి చేసి డాక్టరేట్ పొందింది.

సుబ్బారెడ్డి గారి మరణంతో 'జమీన్‌రైతు' ఒక ఆప్తమిత్రుని కోల్పోయినట్లు విచారిస్తున్నది. వారి కుటుంబానికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

### టపాసుల ప్రేలుడులో ఏడుగురి చావు

వాకాడు మండలం జమీన్ కొత్తపాళెం గ్రామ హరిజన వాడలో మంగళవారం అర్ధరాత్రి జరిగిన బాణా సంచా పేలుడు దుర్ఘటనలో 7 గురు దుర్మరణం పాలయ్యారు. దసరా ఉత్సవాల సందర్భంగా దేవుని ఊరే గింపుకు సంసిద్ధమవుతున్న సమయంలో ఈత చెట్టు పోలిన టపాసుల చెట్టును కాల్చేందుకు తీసు కొస్తుండగా అలం కరణ చేసిన విద్యుత్ సీరియల్ సెట్లను అది తాకి నిప్పులు రేగి, అంటుకున్నదట. ఆ రవ్వలు ప్రక్కనే వున్న ఉత్సవానికి ప్రేలుడు పదార్థాలు తయారు చేస్తున్న గదిపై పడగానే, అక్కడా భారీ ప్రేలుడు సంభవించింది. ఆ సమయంలో గదిలో వున్న నలుగురితో పాటు శబ్దాలకు పరు గెత్తిన వారిలో ముగ్గురు చనిపోయారు. కె. అంకయ్య(16), కె. పోలయ్య (20), అక్కడికక్కడే మరణించగా; ధనాల కృష్ణయ్య కోట ప్రభుత్వ ఆసుపత్రిలో, నెల్లూరు ఆసుపత్రికి వస్తుండగా కె. ఆనందయ్య ఎన్. శ్రీనివాసులు, ఇ. వెంకాద్రి, నెల్లూరు రమణయ్య మరణించారు. జిల్లా కలెక్టర్, ఎస్.పి. గ్రామాన్నిసందర్శించి మృతుల కుటుం బాలను పరామర్శించారు. పండుగ పూట ప్రాణాలు కోల్పోవడం విషాదమే. ఈ దుర్ఘటనకు చలించిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి మృతుల కుటుంబాలకు 10 వేల రూపాయల లెక్కన ఎక్స్‌గ్రేషియా ప్రకటించారు.

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | 9672 | 3,700/- |
| | 9674 | 3,650/- |
| ఐ.ఆర్. 20 | | 3,000/- |
| సన్నాలు | | 2,950/- |
| మొలగొలుకులు బియ్యం | | |
| | 70 కిలోలు | 530/- |

హృదయాన్ని సున్నితంగా స్పృశించి, మధురూహలు రేకెత్తించే

# సుందర కాండ

ముందుగా ఈ చిత్రం టాటాకు కథ వింటే బాగుంటుంది. అది ఒక ప్రేమ కథ. గురుశిష్యుల బంధం ఎంత పవిత్రమైనదో తెలియజెప్పే కథ అది. ప్రేమ మత్తులో ఊగిపోయే కాలేజీ యువకులకు, యువతులకు గుణపాఠం నేర్పే కథ ఇది. వెంకటేష్ (వెంకటేష్) అనే తెలుగు లెక్చరరును రోజా (అపర్ణ-కొత్తనటి) అనే కాలేజీ అమ్మాయి ప్రేమిస్తుంది. గురువు శిష్యురాలిని పెళ్ళాడటం సభ్యత కాదని ఆమె ప్రేమను నిరాకరిస్తారు వెంకటేష్. పలానా రోజాలోపల నన్ను పెళ్ళిచేసుకోక పోతే నేను ఆత్మహత్య చేసుకుంటానని చెప్తుంది రోజా. ఆ రోజా వచ్చేలోగానే వెంకటేష్ అనాధాశ్రయంలోని నాంచారిని (మీనా) పెళ్ళి చేసుకుంటాడు. అయినా రోజా తన పట్టు వీడదు. అతన్ని పెళ్ళి చేసుకునేందుకు ప్రయత్నిస్తుంది. చదువురాని నాంచారికి చదువు చెప్తూ,

చిత్ర సమీక్ష

***

గిద్దలూరు గోపాలరావు

వంట చేతగాని నాంచారికి వంట నేర్పుతూ ఆ ఇంట్లో మకాం వేస్తుంది. వెంకటేష్, రోజాల ప్రేమ బంధాన్ని అమాయకురాలైన నాంచారి చాలా ఆలస్యంగా తెలుసుకుంటుంది. రోజాను వెంకటేష్ రెండవ భార్యగా స్వీకరించేందుకు అంగీకరిస్తుంది. కాని రోజా అంత కాలం దాచిపెట్టిన తన క్యాన్సర్ వ్యాధిని బైట పెట్టడం, రోజా చనిపోవటం జరుగుతుంది. విధివ్రాతను మించిన మధురగీతం లేదని తెలుస్తుంది. జనవాన్ని మరణాన్ని జయించిన రోజా.

ఈ కథ ప్రముఖ తమిళ దర్శక, నిర్మాత, నటుడు అయిన కె. భాగ్యరాజా వ్రాసింది. తమిళంలో విజయవంతంగా నడిచిన "సుందరకాండ" చిత్రం ఆధారంగా తెలుగు చిత్రం నిర్మింపబడింది.

ఆది కవి వాల్మీకి ముని చంద్రుడు తాను వ్రాసిన రామాయణంలోని కిష్కింధా - యుద్ధకాండల మధ్య జరిగిన విశేషాలకు "సుందరకాండ" అని పేరుపెట్టారు. దానికి "సుందరకాండ" అని పేరు పెట్టేందుకు కారణాలున్నాయి. అందులో ప్రథమంగా హనుమంతుని విశ్వరూప సౌందర్యం. ఆయన సేవా ధర్మసౌందర్యం ఉన్నాయి. అలాగే ఈ చిత్రంలో తెలుగు లెక్చరర్ వెంకటేష్ మానవతా గుణ సౌందర్యముంది. ఆయన ఉద్యోగ ధర్మ సౌందర్యముంది. అన్నిటిని మించి గురుశిష్యుల మధ్య వుండవలసిన పవిత్రతా సౌందర్యముంది.

తర్వాత పాంచభౌతిక సుందరత్యానంతా తృణ ప్రాయంగా చూడగల సీతాదేవి "శీలసౌందర్య ముంది. రామాయణంలోని సుందరకాండలో వలెనే ఈ చిత్రంలో రోజా శీలసౌందర్యముంది. వెంకటేష్ [illegible] ఉన్నాయి. అలాగే ఈ చిత్రంలో కన్నుల పండువ చేసే ప్రకృతి దృశ్యాలున్నాయి. రవీంద్రబాబు కెమెరాతో చూపిన ఈ దృశ్యాలు రకరకాల ఆభరణాలతో అలరారే సుందర నారీమణుల్లా కనిపిస్తాయి. భూమికి దిగిన స్వర్గంలా కనిపించే సెట్టింగులున్నాయి. అమరప్రేమకు అపురూపంగా నిర్మించిన తాజ్‌మహల్ సెట్టు యిందుకు తార్కాణం.

లంకానగర్‌లోని కమనీయ కామినీ జనసౌందర్యం లాగే ఈ చిత్రంలో ఇద్దరు హీరోయిన్లుగా నటించిన మీనా, అపర్ణల ముగ్ధ సుకుమార సౌందర్యముంది. వారిద్దరూ వెంకటేష్‌తో సాగించిన శృంగార యాత్ర శృతి మించకుండా ప్రేక్షకుల హృదయ శృంగారవీణ తంత్రుల్ని మీటిన ప్రతిశృంగార చేష్ట రమ్య సుందరం. వారిద్దరూ ఒకరికోసం మరొకరు చూపిన త్యాగంలోని హృదయసౌందర్యాల, రూపసౌందర్యాల సమ్మేళనం ఒక సుందర నందనం.

ఆపైన రామాయణంలోని సుందర కాండలో దశకంఠ రావణుని రాజస వీరసౌందర్యముంది. అట్లాగే ఈ చిత్రంలోని హీరో వెంకటేష్ ధీశక్తి, ధీరత్వంతో చేసిన ఫైటింగుల్లో రాజసవీరసౌందర్యం ఉట్టిపడుతుంది.

ప్రతి మానవుడికీ జీవితం మీద ఆశ కల్పించే సన్నివేశాలు రామాయణంలోని సుందరకాండలో ఉన్నాయి. అలాంటి సాదృశ్యాలు ఈ చిత్రంలో లేకపోలేదు. వెంకటేశుని పెళ్ళిచేసుకోవాలన్న ఆశ రోజాలో

కొరవ 8 పేజీలో

నిర్మల
NIRMALA NUT POWDER MANUFACTURING
నిర్మల 20 పైసల వక్కపొడి
అన్ని షాపులలో దొరుకును



వింతకోడళ్ళు చిత్రంలో తులసి, జయసుధ, డిస్కో శాంతి, యువశ్రీ

# అక్కినేనిలో ఎంత వినయం?

అక్కినేనికి కాలేజీ డిగ్రీ లేదుగాని, ప్రపంచజ్ఞానం ఎంత ఉందో ఆయన వాగ్ధాటి వల్ల తెలుస్తుంది. ఏ విషయం గురించైనా, ఆయన అనర్గళంగా మాట్లాడగలరు. ఇటీవల ఏదో ప్రస్తావన వచ్చి, "దేవదాసుగాని, సీతారామయ్య మనమరాలుగాని, దసరాబుల్లోడు గాని, ప్రేమనగర్‌గాని, నా నటనవల్లనే సూపర్ హిట్స్ అయ్యాయి అంటే నేను సుతరామూ అంగీకరించను. ఏ సినిమా అయినా హీరో నటనా సామర్థ్యం వల్ల హిట్ అవదు. ఈ విషయం మిగతా హీరోలకు బాధ కల్గించవచ్చేమో గాని, నా అభిప్రాయం మాత్రం ఇది. సక్సెస్‌కు మూలకారణం కథ ఒక్కటే. సాదా సీదా కథలో ఏ హీరో ఎంతటి సామర్థ్యాన్ని ప్రదర్శించినా అది హిట్ అవుతుందా? ముమ్మాటికీ కాదు. దర్శకుడు ప్రతిభ చూపడానికి కూడా కథే కారణం. కథ బాగుంటేనే దర్శకుడు గొప్పగా మలచి, చక్కగా నడపడానికి వీలవుతుంది. అంచేత, ఏదైనా చిత్రం హిట్ అవడంతో హీరోగాని, దర్శకుడుగాని, తన రేటును పెంచడం సమంజసం కాదు. అలాగే ఎక్కువ డబ్బు తీసుకునే హీరో అందరికన్నా గొప్పవాడు కానేరడు." అని చెప్పారు.

ఇప్పటి హీరోలకు మార్గ దర్శకుడు అన దగ్గ అక్కినేని చెప్పిన విషయాలలోని సత్యాన్ని ఇప్పటి హీరోలు గుర్తించాలి.

ఇప్పటి హీరోలు
ఇంత నిక్కచ్చిగా
నిజాలు మాట్లాడ
గలరా?

## షావుకారు జానకి రెస్టారెంటు

"నటన నావృత్తి, పాక కళ నా వ్యసనం" అంటుంది దాదాపు 375 చిత్రాలలో నటించిన షావుకారు జానకి. మద్రాసులో ఇటీవలే నెలకొల్పబడిన "కోకనట్ గ్రోవ్ రెస్టారెంట్" లో ఈమె పాకశాల అధికారిణి.

అసలు నిరుడు అమెరికా వెళ్ళినపడు లాస్ ఏంజెల్స్ లో 'షావుకార్స్' అనే రెస్టారెంట్ ప్రారంభించాను. మన భారతీయులను చాలా మందిని ఆకర్షించిందా రెస్టారెంట్. అటువంటిదే మద్రాసులో నెలకొల్పాలన్న నా ఆశయం ఇంత కాలానికి నెరవేరింది. చపాతీ, చట్నీలు, సాంబార్, పప్పు, చారు, మజ్జిగపులుసు, ఎంతో రుచికరంగా తయారు చేయడం మా స్పెషాలిటీ; ప్రతి రోజూ 16 ఐటమ్‌లకన్నా ఎక్కువే తయారు చేస్తుంటాం. నేను ప్రతిరోజూ దాదాపు ఎనిమిది గంటలపాటు ఈ రెస్టారెంట్ వ్యవహారాలు చూసుకుంటుంటాను. ఈ గాస్ పొయ్యిల వేడి సినిమా లైట్ల వేడికన్నా ఎక్కువేం కాదు. మొన్న మమ్ముట్టి వచ్చి ఆహార పదార్థాలు ఎంతో రుచికరంగా ఉన్నాయని మెచ్చుకున్నారు. చాలా మంది స్టార్స్ వచ్చారు. రజనీకాంత్ త్వరలో వస్తానన్నారు. మంచి పాత్రలు లభిస్తే, సినిమాలలో నటించడం మాత్రం మాననండోయ్," అన్నారామె నవ్వుతూ.

కొరవ 8 పేజీలో

ఓం
నెల్లూరు జిల్లా ఆత్మబంధువులకు
విజయదశమి శుభాభివందనములు
మురళీకృష్ణ 70
A/c రెస్టారెంట్
మురళీకృష్ణ గోపాలయ్య
మద్రాస్ బస్టాండ్ సెంటర్, నెల్లూరు.

# సర్వ సౌకర్య విలసిత
# విలాస విడిది మందిరమే కాదు.....




## విశ్వసనీయ భవితవ్యమే నిర్మించబోతున్నాం!

### జారీ విశిష్టతలు:

- హుస్సేన్ సాగర్ తీరంలో, బుద్ధ పూర్ణిమ ప్రాజెక్ట్‌కి అభిముఖంగా 150 గదులు గల త్రీస్టార్ డీలక్స్ హోటల్.
- ప్రమోటర్లు గత పదేండ్ల నుంచి హైదరాబాద్‌లో డీలక్స్ రెస్టారెంట్‌లూ, లాడ్జింగ్ హౌస్‌లూ నిర్వహించడంలో అనుభవజ్ఞులు.
  హైదరాబాద్ నడిబొడ్డున విమానాశ్రయానికి, రైల్వే స్టేషన్‌కి దగ్గరలో ఉన్న హోటల్.
- అతి తక్కువ గెస్టేషన్ పీరియడ్, నవంబర్, 1992 నుంచీ నిర్వహణ ప్రారంభం.
  SBI మ్యూచువల్ ఫండ్, కాన్ బ్యాంక్ మ్యూచువల్ ఫండ్ ఈక్విటీలో పాల్గొంటున్నాయి.
- వివిధ పన్ను రాయితీలు: వినోదపు పన్ను, వ్యయపు పన్ను లేవు; ఆదాయపు పన్ను చట్టం క్రింద సెక్షన్ 80L & 80M రాయితీలు
- క్రయవిక్రయాలకు అనుగుణంగా బొంబే, హైదరాబాద్ స్టాక్ ఎక్ఛేంజిలలో నమోదు చేయబడుతుంది.

ఒక్కొక్కటి రూ. 10/- లు ముఖవిలువగల
ఈక్విటీ షేర్ల పబ్లిక్ ఇష్యూ మొత్తం
**రూ. 2,65,00,000/-**

### రిస్క్ ఫాక్టర్లు:

- హోటల్ పరిశ్రమ యాత్రికుల రాకపోకలపై ఆధారపడి ఉంటుంది. రాజకీయ లేక సామాజిక అంతరాయాలు కంపెనీ లాభాలపై ప్రభావం చూపుతాయి.
  తీవ్రమైన పోటీ, కార్మిక సమస్యలు హోటల్ పరిశ్రమలో ఉన్నవి.
- స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ వారి చివరి విడత రూ. 40 లక్షలు మరియు బ్యాంక్ ఆఫ్ బరోడా వారి చివరి విడత రూ. 10 లక్షలు జారీ ఏర్పాట్లు జరుగుతున్నవి.
  ప్రమోటర్ల పెట్టుబడికి రూ. 25 లక్షల విడుదల రెన్యూవల్ గురించి
- కాన్ బ్యాంక్ మ్యూచువల్ ఫండ్
  నుంచి ఉత్తరం రావల్సివుంది.

**జారీ ప్రారంభం 12 అక్టోబరు 1992**

హోటళ్ళ నిర్వహణలో ప్రమోటర్ల
కున్న పదేళ్ళ అనుభవం
వైస్రాయ్ ప్యాలస్ హైట్స్
సందేహాతీత భవితవ్యానికి
ఒక తిరుగులేని హామీ!




## PALACE HEIGHTS HOTELS LIMITED

Regd. Office : 1-3-1036/3/1, Lower Tank Bund Road, Gandhinagar, Hyderabad - 500 380.

Lead Managers to the Issue :


**SBI CAPITAL MARKETS LIMITED,**
202 Maker Towers, 'E' Cuffe Parade, Bombay-400 025.

Co-Managers to the Issue :


**BANK OF BARODA**
Merchant Banking Division,
90, C.P. Ramaswamy Road,
Alwarpet, Madras - 600 018.


**STATE BANK OF HYDERABAD**
MBB, Head Office,
Gunfoundry,
Hyderabad - 500 177.


**Indbank**
Merchant Banking Services Ltd.,
5th Floor, Lingapur House, Himayatnagar
Hyderabad - 500 029.

If the Company does not receive the minimum subscription of 90% of the issued amount the entire subscription will be refunded to the applicants within 90 days from the closure of the issue. If there is a delay in refund of such amount by more than 8 days, the Company will pay interest @ 15% p.a. for the delayed period.

Sobhagya



పక్షులకే కాదు
మీకు కావలి
గూడు

నెల్లూరు
మునిసిపాలిటీ పరిధిలో
ప్లాట్లు అందిస్తున్న ప్రత్యేక సంస్థ

వి. ఆర్. కాలేజి
కాలువ
అపోలో హాస్పిటల్
డెంటల్ కాలేజి
ఆర్ట్స్ కాలేజి
రత్నం కోచింగ్ సెంటర్
కృష్ణ అవెన్యూ
అగ్రికల్చరల్ రిసెర్చ్ సెంటర్
పార్థసారథి రియల్ ఎస్టేట్స్







RECORD BREAK IN OUTRATE SALES IN NELLORE HISTORY



**పార్థసారథి రియల్ ఎస్టేట్స్.**



రూమ్. నెం. 5, బి. బ్లాక్ (మిద్దెపైన) సాయి కృష్ణ కాంప్లెక్స్,
జొన్నలగడ్డ వారి వీధి, నెల్లూరు - 1

*Veda* PH: 29470

NICE

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.